# షట్కథామంజరి.

శిష్ట్లా వెంకటసుబ్బయ్యగారిచే

రచింపఁబడినవి.

రెండవ కూర్పు.



సీతారామా ముద్రాక్షరశాల యందు ముద్రింపఁబడియె.

నరసాపురము.

1929

 [ వెల 0—10—0.

# PREFACE.

This book is my first attempt. However it has been very highly appreciated by learned Scholars and enlightened educationists such as M. R. Ry. Ch. Bhanumurty Pantulu garu B. A., L. T. Translator to Govt. (Retired) M. R. Ry. P. RamaRao Pantulu garu B. A., B. L. Subordinate judge, M.R.Ry. Kuchi Narasimham Pantulu garu B. A., L. T etc. who have been kindly pleased to favour me with their valuable opinions on this book.

I am highly thankful to the S. S. L. C. Text Book Selection Board who have been pleased to encourage me by prescribing this as a Text Book for the S. S. L. C. (Group A) for 1930

*Narsapur,*
28—5—29.

**Sista Venkata Subbayya,**

శ్రీ జగన్నాథాయనమః

# గురుస్తుతి.

సీ. సచ్ఛాత్రనికురుంబ సరసీరుహాళికి
ద్వాదశాత్మనిభంగిఁ దనరువాని
సంస్కృతిభాషావిశారదచాతక
పటలికి వృష్టియై పరగువాని
లసదలంకార శాస్త్రసము పేతపికాళి
కెల్ల వసంతమై యెసఁగువాని
ప్రథితతర్క వ్యాకరణ వేద్యబుధులకు
సురగణాచార్యుఁడై వఱలువాని
గీ. మేటి యగుచును బాండితీ పేటి యగుచు
నన్వయశిఖామణి యటంచును నంది బిరుదు
సేతుశీతాద్రిమధ్యవిఖ్యాతుఁడైన
అమల వేమూరివంశదుగ్ధాబ్ధిచంద్రు
రామగోవిందశాస్త్రిని బ్రస్తుతింతు.
సీ. కలితదర్భావంశ కలశరత్నాకర
కమనీయపూర్ణిమా విమలరోచి
పటుతరబోధనప్రతిభాతిశయమున
సాటి జెప్పఁగరాని మేటియొజ్జ
ఘనతరశిష్యప్రకాండవృతాజ్ఞాన
తిమిరసందోహ ప్రదీపకళిక

తనయొత్తు ధనమును ధారవోసినయేని
ధర్మంబుదప్పని ధర్మపరుఁడు

గీ. పండితాగ్రగణ్యుఁడు మద్గురుండు మాన్యుఁ
డైన శైలరుపాఠశాలాంధ్రగురుఁడు
శ్రీజగన్నాథశాస్త్రియంఘ్రియుగము నకు
నతు లొనర్తు ననారతంబతులభక్తి

గీ. నేరచించిన గ్రంథముల్ పారఁజదివి
మంచియిది చెడ్డయంచు బోధించి చెప్పి
కన్నకొమరుని మాడ్కి నన్నెన్నినట్టి
భానుమూర్తుల నిరతంబు బ్రస్తుతింతు.

సీ. గురుతర కౌండిన్య గోత్రపవిత్రుండు
శిష్టాన్వవాయాబ్ధి శిశిరకరుఁడు
లక్ష్మినరసమాంబ రహి ముద్దుకొమరుండు
చండికాయాగ యాజకవరుండు
బహుళగీర్వాణ ప్రబంధవిజ్ఞానుండు
సకలకర్మకలాప చక్రవర్తి
కాశీపురోపార్జి తాశాంతరవ్యాప్త
మంత్రశాస్త్రానీక మండితుండు

గీ. సూరిజనవందితుఁడు పరిశుద్ధయశుఁడు
బహుళశిష్య సితాంభోజభాస్కరుండు
ప్రథితశాంతుండు సూర్యనారాయణాంకు
వెలయు నాతండ్రి మన్మనోవిధియుండు.

# అంకితము.

ఆయతకీర్తులై విమలులై తగు నాతలిదండ్రు లెవ్వఁడో
కాయమువాయుటాది నవకమ్మున మమ్ములఁ జేరదీసి పి
త్రాయితుఁడై సతమ్ము ననురాగరసమ్మునఁ జిల్కరించి మా
దాయ లొనర్పు దుండగపు తండముల న్దొలఁగంగఁ జేసినా
కాయము సర్వకాలములఁ గాటికి రెప్పయు నో లెఁగాచి వి
ద్యాయుతుఁ జేసి వేగ మధికార్థసమన్వితనొక్క కన్యకం
బాయక పెండ్లి జేసి యొకమాన్యునిఁ జేసిన భూరికీర్తిధౌ
రేయుని ధీవిశాలుని వరీయసునిన్ విమలాంతరంగునిన్
వేయును జెప్ప నేటికి వివేకవిచారధురీణు సత్యనా
రాయణు నాదుభావుకు నిరంతర ముత్కటమైన భక్తిమై
నాయొనరించు నీకృతికి నాథునిగా నొనరింతుఁ బేరిమిన్.



శ్రీజగన్నాథాయనమః.

# షట్కథామంజరి.



## వితరణఖని.



"మ॥ బలి నంభోరుహనేత్రుఁ డేమికొఱకై పాదత్రయి న్వేఁడెని
శ్చలుఁడున్బ్రాహ్మణుఁడులబ్ధకాముఁడురమాసంపన్నుఁడై దాఁబర
స్థలికిన్ దీనునిమాడ్కి నేలచనియెన్ దప్పేమియున్ లేక ని
ష్కలుషున్బంధనమేలచేసెనువినంగౌతూహలంబయ్యెడిన్"

కర్ణ దధీచి శిబిప్రముఖులవలె బలిచక్రవర్తి కడు వదాన్యుఁడు. భోగంబునం దంతకంటె వేయిమడుంగు లెక్కుడనిన నతిశయోక్తి కాఁజాలదు. పాతాళంబున కాతఁ డధిపతి. ఘోరతప మాచరించి బ్రహ్మ భృగుప్రవరులవలన వరంబుల నేకంబులు గైకొన్న మహాతపశ్శక్తి సంపన్నుఁడు. హరియు నీశ్వరుఁడు గూడ వానితో నని సేసి రేని యోటమి నొందగ లార లని చెప్ప నొప్పు. మూర్తీభవించిన ధర్మం బతఁడే! ప్రజల సంపన్నత్వ మనిన ననుదినంబును బసిఁడియనఁటియాకులఁ

బురజనులందఱు భుజించి మరల భుజించుట కవి యసహ్యంబు
లని యావల పాఱవైచుచుండిరి. శునకాదులగు తిర్యగ్జంతువు
లాపత్రముకడఁ జేరి యొక్కసారియే లేహనము సేసి నాకినది
మరలనాకుట కిచ్చయింపక వేఱొండు పసిఁడి యాకునకుఁ
బోవుచుండు. ప్రతిహారశ్రేష్ఠ పురోభాగంబున నుంపఁబడిన బం
గరు పంజరంబులఁ గీరశారికలు గూడ ద్విజులే యగుట
నుషఃకాలంబునఁ దొలిఁజదువు లను దినంబు గుణియించు
చుండు. దానసహస్రంబుల విప్రులఁ దనిపి, పెద్దల కొద్దిక
మీఱ మ్రొక్కులిడి, పరమేశ్వరున కంజలి ఘటించి, యసుర
వీరులు బలసి కొలువఁ గొలువుండి బలి స్వర్గ మర్త్యంబుల
జయింప వలెనను తన మనో నిశ్చయంబు వెల్లడింప నెల్ల
దైతేయులు నుల్లంబునఁ బెల్లు సంతసించి తజ్జయాభిలాషులై
యుద్ధంబునకు సంసిద్ధులైరి.

త్రిలోకవందితౌదార్యశౌర్యాదిశోజ్జ్వలకీర్తియు, విలో
కజన నేత్రానందకర మనోహరమూర్తియు, దుర్జనానీకలయకా
లాత్యుగ్రసమవర్తియు నగు బలిచక్రవర్తి సురేంద్రు నిర్జింప
సమకట్టి, పయనంబై స్వర్గంబుపై దాడివెడలి, కలహంస
కారండవకలకలారావంబులును, నరవిందనట దిందిందిరఝం
కార సంకులంబులు నగు, పొగడ్త కెక్కిన యగడ్తల దాఁటి
శస్త్రధారులై శూరులైన ద్వారపాలకుల నోడించి, తద్రక్షి
తంబులగు గాంగేయకవాటంబుల భేదించి, మహారజత భర్మ

వజ్రమయంబులగు చతుర్ద్వారంబులఁ గడచి, భర్మనిర్మిత హర్మ్యంబులఁ గనుంగొని, విభ్రాజమానమాటపఖచితరుచిర చింతారత్నంబు గల్గి రత్నాకరంబుఁబోలె, విమలాంతరంగ ద్యోతమానంబై (మానధనుని నడనడియుం బోలె సన్మార్గ సుందరంబై,) యుద్యానవనంబు పోలె రంభాభి రామంబై వెలుంగు నిలింపనగరంబు గాంచి యాశ్చర్యభరితుండై తనలోఁ దాని ట్లు తలపోయఁ జొచ్చె.

మాయురే! మాసినచీర కట్టుకొనువారును! బాపురే బలునగవులకుఁ గనుమూయు వారును, మజ్జారే! దుర్జనుల డాయువారు, నోహో! కాలగతికి లోనై ముదియువారు నయ్యారే! పుణ్యజనంబుల బాయువారు, నౌరా! నిరంతరమ తిథిసత్కారంబులం జేయనివారును, చాగురే! భాగధేయం బుల కుబ్బక యబ్బురంబుగ నింత పరులకుఁ బడవేయని వా రును, నాకంబునం దేవంక విలోకించినఁ గానరారు. ఇట్టి పుణ్య లోకంబు పరిపాలించిన వాఁడేగదా మహాపుణ్యశాలి యని త లపోసి రణసూచకంబులగు భేరీభాంకార ధ్వనులు దిక్కులఁ బి క్కటిల్ల బలి మ్రోయఁ జేసె.

శచీదేవి వామాంకంబున శిరం బిడి విశ్రాంతినొంది యున్న యా వేయికన్నుల వేల్పు బలిధాటి తటాలున విని భ్రాంతినొందిన వానిపగిదిఁ దడవికొనుచు "శచీ! శచీ! యెం దుంటి వెందుంటి వెంతముప్పు వాటిల్లె" నని యాక్రోశించు

చుండ వారిజంబు వడువున వాడియున్న నిజవల్లభుని ముఖం బుఁ జూచి, వగచి "నాథా! ఏమిది?" యని శచి యడుగ మి తిమీఱిన దుఃఖంబున సురేశుండు "ప్రళయానలునిభంగి ఘో రరాక్షసులను గూడి, మొన్న మొన్న మన కోడి, నేఁడు బలి మరల వచ్చియున్నాఁడు. కటకటా! వీని కెవ్వఁడు క్రోడయ్యె వీనిం గెలువ నింకేది వెరవు. భూమ్యాకాశంబుల మిర్రింగు రీతి వెలుగొందు వీని యాకారమేమి? కనకాద్రి చందంబునం బెనుపొందు వీని శరీరౌన్నత్యమేమి? మోహరంబున నెవ్వానిను గంటిమి వీని మోహరింప నోపు." నని వగచి వగచి సకలకా ర్యవేదియగు బృహస్పతిని రావించె. గీష్పతి యట కేతెంచి యాతనిచేఁ బ్రార్థితుండై యిట్లనియె.

"రాజేంద్రా! ఈరాక్షసు నెదిరించి పోర హరుం డొండె హరి యొండెఁ గావలయును. నీవును, నీసములును, నీకన్న నధికులును, వీని వారింపఁ జాలరు. విప్రసేవాపరాయ ణత్వంబున వీని కింత బలంబు హెచ్చె. ఇఁక వారిఁ బూజిం పమి నాతఁడు చెడఁగలఁడు. అందాఁక మనము తలఁగవలయు. పోరితిమా! పరు గెలువవలయు. లేక చావవలయు. స్తుతియు జయోన్నతియు లేకున్నఁ గోరిన ఫల మేమి ? కాన గోప్యం బు గాపాడుకొన మనము తొలఁగుట మంచి"యని నుడివిన గురునిహితంబుల గ్రహించి పూర్వౌన్నత్యంబు మనంబునఁ ద లంచి యిట్లు వాపోవఁదొడంగె.

నిరుపమాన నిష్కృత్తాఖిలదురితసుఖదాయిని వగు నో యమరావతీ! నినుఁ బాసిపోఁగలమా! ఊర్ధ్వలోకావలోక నానందతుందిల చిత్తంబునఁ దలంచి నంత వచ్చి యాశ్రివమొనర్చు నుచ్చైశ్శ్రివమా! నిన్నధిష్టించి వాహ్యాళి వెడలు భాగ్యము నేటితోఁ దీఱిపోవునా! మందారాదికల్పభూరుహ సుమనస్సౌరభ్యసంవాససుందర మగు నో నందనమా! నీపొందు వీడిపోయి నే నెందు కుందువాఁడను. అత్యంత సుఖాస్పదం బగు వైజయంతీ! నీవింత భోగంబుల నిఁక నే నెట్లనుభవింతు. ఉత్తుంగ శిఖరోపమాన కుంభశోభితశరక్షీమూతసదృశంబ వగు నైరావతమా! నిన్ను విడనాడి వెడలు టెట్లు? ప్రాణసంకటసమయరక్షణోపాయనిధి వగు నో బృహస్పతీ! ఇపుడు నిన్ను విడనాడి పోవలసివచ్చెనా?" యని వాపోయి విధికృతంబునఁ ద్రివిష్టపంబు వీడి కామరూపుఁడై స్వర్గాధిపతి నిర్గమించె. తక్కుంగల దివిజులును గామరూపులై యిచ్చవచ్చిన తావు లకుం జనిరి.

బలిచక్రివర్తి ప్రతిభటవివర్జితమగు కోటం జొచ్చి యనాయాసంబుగ నమరసింహాసనం బధిష్టించి జగత్త్రియంబును తన వశంబుచేసికొని విశ్వవిజయుఁడై పెద్దకాలంబు రాజ్యంబు చేయుచు భృగ్వాదుల యాజ్ఞానుసారంబు శతాశ్వమేధంబులు నేసి యింద్రుని రాజ్యపరిపాలనా వైఖరిని ద్రోసి రాజనిపించె. అక్కాలంబున

"శా॥ అర్థుల్ వేడరు, దాతలుం జెడరు, సగ్వారంభముల్పొందుఁ బ్రి
త్యర్థుల్లేరుఁ మహోత్సవంబులను దేవాగారముల్ పొల్చుఁ బూ
జ్ఞార్థుల్ విప్రులు వర్షముల్ గురియఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్."

కశ్యపబ్రహ్మ యంతకుమున్నె బంధవిముక్తికై సుందరంబు లగు నందనవన కందరంబులఁ దపోనిష్ఠమై నుండి యొరుల కెవ్వరికిఁ గానుపింపక ఘోరతపం బొనరించుచుండె. దైత్యులు దివి నాక్రమింప నమరులు ప్రోలు వీడిపోవుటం జేసి సురమాత పరితాపమును బొంది తన భర్తను మానసవీథిం దలంచి నంతనె యతండు సమాధి మాని, తన ప్రేయసికిఁ బ్రత్యక్షమైవంది, కుంది, వ్రాలి, వాడినయిల్లాలిముఖాంబుజంబు వీక్షించి, ప్రేమమెయి నామెం దొడపై నిడుకొని, "ఇంతీ! ఏల విలపించెదవు? ధర్మంబు నతిక్రమించి యధర్మమార్గంబు నం దేమైనఁ బ్రవర్తించితివా? కొమరులు ధర్మమార్గమును వీడియుండిరా? అభ్యాగతుల కన్న మిడుట యేమఱ లేదు గదా! ఇంకేల యీ పరితాప" మని యడిగె. అదితి "నాథా! మహాభీమబలాఢ్యు లగు, దితిబిడ్డలు మనబిడ్డల నందఱను బాఱఁ ద్రోలి నేఁ డమరావతి నేలుచున్నారు. ఔరా! నాసోదరి యయ్యు నాదితి యన్నియుఁ జూచి నగుచుండుఁ గాని "నాయనా! అది కూడనిపని" యని యొక్కమారు లాంఛనమున కైన బలి నదలింపదయ్యె.

అయ్యో! వా రసూర్యంపశ్య యగు సురరాజదారను గూడఁ గనికరము లేక పురము వెడల నడిచిరి. అన్నన్నా! యేమి చెప్పుదును!

"సీ. ఎండకన్నెఱుఁగని యిందు్రని యిల్లాలు
పలుపంచలను జాలి బడిరో నేఁడు
త్రిభువనసామ్రాజ్యవిభవంబు గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
కలిమి గారాబుబిడ్డలు జయంతాదులు
శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
అమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటపట్టయ్యె నేఁడు
ఆ. వె. బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు
వాని గెలువ రాదు వాసవునకు
యాగభాగ మెల్ల నతఁ డాహరించును
కడఁగి సురల కొక్కకడియు నీఁడు?"

ఎల్లప్రజలును నీకు సములు. దుష్టమతుల శిక్షించు టయు శిష్టమతుల రక్షించుటయుఁ గర్తవ్యము. శోకసాగరం బున మునింగిన సురల నుద్ధరించి, రాత్రించరుల శాసించి, నీకరుణాకటాక్ష నిర్ఝరులఁ దనుపు" మను మనోవల్లభ పలుకు లాకర్ణించి, కడుం గడు విచారించి, విజ్ఞానదృష్టి నవలంబించి భావికాల కార్యంబు విచారించి, యామెకుఁ దంత్రోపదేశంబు

చేసి కశ్యపుఁడు కృపాపారీణుం డగు జగదీశు నర్థించిన నీ కి ష్టార్థంబు లగు నని యామెకు బోధించె. గృహిణి యానంద భరితయై "నాథా, ఏరీతి నేకాలంబునం దే మంత్రరాజంబున నిష్టార్థం బగు" నని యడిగినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయఃపానం బనుప్రతం బుపదేశించి, యుక్తకాలంబునఁ దన్మంత్రంబును దద్విధానంబును నెఱిఁగించిన నావల్లభ ఫాల్గునమాసంబున శుక్లపక్ష పాడ్యమి మొదలు పండ్రెండు దినంబులు హరిస మర్పణంబుగా వ్రతంబు సేసిన శంఖచక్రగదాధరుండగు నారాయణుండు ప్రత్యక్షుం డైన "దేవా దేవతలఁ బాఱఁదోలి దైత్యు లమరావతి నేలుచున్నవారు. కన్నకడుపుగానఁ గంటికి సరిగాఁ జూడ్కరాదు. ఈకడుపుశోక్కమాన్పి రక్షింపు" మని ప్రార్థించిన నాతఁడు దరహాసితవదనుఁడై "జననీ! విన యోపాయంబులం గాని బలవంతంబుగ దివిజారుల వంచింప రాదు. నీకు సుతుండ నౌటకు నాకుఁ గడుంగడు కోర్కె గలదు. కాన నీగర్భంబున జనిమించి, నిలింపుల రక్షించి దైత్యుల వంచించి, వారి రాజ్యంబు హరించి నీసుతున కిత్తు. నీవింక నూఱడిల్లు" మని పురాణపురుషుం డానతిచ్చి తిరో హితుఁడయ్యె.

అదితి నాటంగోలె కశ్యపబ్రహ్మనాశ్రయించి నిరంతర సేవాతత్పరతనుండె. అంతఁ గొంతకాలంబున కాకలికి గర్భంబుఁ దాల్చి నిండుచూలా లయ్యె. వీరులు నవ్వుచున్నవో యను

న్నులు వికసించుచుండఁ బద్మినీకాంతకు వింతగా ముడిచిన ధమ్మిల్లమో యన షట్పదం బందుఁ దేనెఁ గ్రోలుచుండ రంభాదులగు నాకజలజాక్షులు నాట్యంబు సేయ, శ్రవణ ద్వాదశినాఁడు శ్రోణాభిజిల్లగ్నంబున శంఖచక్రగదాపద్మసంకలిత చతుర్బాహుంబును, బిశంగ వస్త్రంబును మకరకుండల మండితగండభాగంబును, శ్రీవత్సలాంఛనంబును, కౌస్తుభాభరణంబునైన వామనాకృతిఁ బుణ్యావ్రతోపేతయుఁ బరమ పాతివ్రత్య విఖ్యాతయు నగు దివిజాధీశ్వరు మాతకుఁ బూతచరిత్రుండగు పీతాంబరుం డావిర్భవించె.

దివ్యతేజోవిరాజితుండగు నబ్బాలకుని యద్భుతపు జననం బవలోకించి జనని వెఱఁగు పడియె. భక్తితత్పరుండగు నా కశ్యపుఁడు బాలకుం గాంచి తన్మయుండై పరాత్పరుండని గ్రహించి వానిని నుతింప మొదలిడె. అంత నా దేవదేవుండు తన దివ్యరూపంబు నుజ్జగించి, కపటవామన రూపంబుఁ దాల్చి సామాన్య బాలకు చందంబున నప్పటినుండియు తనతొక్కు మాటలచేఁ దలిదండ్రుల కెక్కుడు మోదంబు కలిగించుచుఁ "నాయనా" యని పిల్చినఁ గాలి గజ్జెలు మ్రోయ సంతసంబునఁ దానింత ముఖము చేసికొని వారిం డాయఁబోవును. ఇట్లు కొంత కాల మరుగుడుఁ గాలక్రమంబునఁ దలిదండ్రులు చౌలోపనయనాదు లొనర్చిరి. ఉపనయన కాలంబున నా బాలునకు సవిత సావిత్రి నుపదేశించె. బృహస్పతి యజ్ఞోపవీతంబును, కశ్యపుఁడు

ముంజియు, దితి గౌపీనంబును, బ్రహ్మ కమండలమును, సప్తర్షులు కుశపవిత్రంబులను, యక్షాధిపతి భిక్షాపాత్రము నిచ్చిరి. భవాని వానికిఁ దొలుతఁ బూర్ణభిక్ష నొసంగె.

అంతఁ గొన్నాళ్ళకు మాయాబాలకుండు దేశాంతర సమాగతు లగు విప్రులనవలోకించి "బ్రాహ్మణులారా! విప్రులకు వలయు పదార్థంబులిచ్చి చక్కఁగాఁ దనుపు దానపరుఁ డెవ్వఁ డేనిఁ గలఁడా?" యని యడిగిన విప్రులు వాని కిట్లనిరి. "బలిం బోలు వదాన్యు లెవ్వరును గానరారు. ఆతఁడు శతాధ్వరము లొనర్చి యైంద్రపదవి నాక్రమించిన మహాయశుండు. వాని నాశ్రయించిన బహుసంపల్లాభంబు పడయ వచ్చు" నని న విని నిర్మలాంబు నివారితదుర్మదయగునర్మద దాఁటి దాని యుత్తరతటంబున వేదండాశ్వధ్వజనీకవాటంబగు బలిమఖాంతర్వేదికావాటమును వటుండు గాంచి యందుఁ బ్రవేశించె.

జనులు కోటిసూర్యప్రభాభాసమానుండగు నావటువుం గాంచి "శంభుఁడు వీనికి లోచ్చు. హరియన్ననోకొదువ. పద్మభవుఁడో కొద్ది. చండాంశుఁడో తగ్గు. వీతిహోత్రుఁడో కుందు. హిమాంశుండొచ్చెము. కుసుమాయుధుండుకుఱుచ. దంభాకారముఁ దాల్చి వచ్చిన యీశుంభద్యోతనుఁ డెవ్వాఁడై యుండునో" యనిగుజగుజలువోవువారును, గలకలపడువారునై యుండిరి. ఆసమయంబున బలిచక్రవర్తి సభామంటపంబు దరియంజొచ్చి, హోతలసామగానంబు వినుచు, యాజులమంత్రి

తంత్రార్థభావ ప్రయోగంబులం గొనియాడుచు, యాజకులు హోమకుండంబులఁ ద్రేతాగ్నుల వెలిఁగించుటం గని మెచ్చు కొంచు, బహువిధాధ్వరవిధానంబులు బల్కు సభ్యుల నుతించు చు, సభామంటపంబు నల్లడల, దిరుగుచు మాయామాణవకుం డందఱ కన్నిరూపులై కాన్పించి వినోదింపఁ జేయుచు, వెడ వెడ నడచుచు గడకొని నుడువులు వడివడి నుడువుచు, నవ్వడు వాయెడయవిఁగని "ఈతఁడే సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి యగు దానవచక్రవర్తి" యని కుశపవిత్రాక్షత సంయుతంబగు దక్షిణహస్తంబు చాచి, రక్షోవల్లభు మస్తకంబున నుంచి రహి మీఱ దీవించె. లలితకరుణాకలితుఁ డగుబలి యావటువుంగాం చిపోయి, గద్దియ నునిచి, వాని యడుగుఁదమ్ములమడుపుకాం డంబులం గడిగి మడుపుదోవతిఁ బాదంబులఁ దుడిచి, యుడు గక యావటుని పాదసలిలంబు శిరంబునఁ జల్లుకొని

"మ. వడుగా! యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలంబెయ్యది
యెయ్యడకు న్నీవరుదెంచుటన్నఫలమయ్యెవ్వాంశముస్జన్మముం
గడుధన్యాత్ముఁడనైతినీమఖము యోగ్యంబయ్యెనాకోరిక
ల్గడ తేరెన్ సుహృతంబులయ్యె శిఖులున్గల్యాణమెకాలమున్."

మ. వరచేలంబులొ,మాడలో,ఫలములో,వన్యంబులో,గోవులో
హారులో,రత్నములో,రథంబులొ,విశిష్టార్థంబులో, కన్యలో,
కరులో,కాంచనమో,నికేతనములో, గ్రామంబులో,భూములో,
ధరణీఖండమొ,కాక యేమడిగెదో?ధాత్రీసురేంద్రోత్తమా!

అని వినయపూర్వకంబుగఁ బలికిన బలిచక్రవర్తి లలిత వచనంబుల కెంతయు నలరి వడుగు "దానవేంద్రా!

సీ. ఇది నాకు నెల వని యేమని పలుకుదు
  నొకచోటనక నిండి యుండ నేర్తు
నెవ్వనివాఁడ నం చే మని పలుకుదు
  నాయంతవాఁడనై నడువ నేర్తు
నీనడువడి యని యెట్లు వక్కాణింతుఁ
  బూని ముప్పోకలఁ బోవ నేర్తు
నది నేర్తు నిది నేర్తు నని యేలఁ జెప్పంగ
  నేరుపు లన్నియు నేన నేర్తు
ఆ. వె. నోరులు గారు నాకు నోకలకు నే నాదు
నొంటివాఁడఁ జుట్టు మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నాకెంకి
సుజనులందుఁ దఱుచుఁ జొచ్చి యుందు."

అది యటుండ నిమ్ము. కరుణానువర్తనులును, సత్యమూర్తులును, ధర్మపథానువర్తనులును సమరపాండిత్యపారంగతులును మీకులమం దుదయించిరి. తొల్లి మీవంశమందు రణభీరువులు గాని వితరణభీరువులు గాని లేరు. మీముత్తాతన తాత హిరణ్యాక్షుఁడు విశ్వవిజయంబు చేసి భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరించె. మీతండ్రియన్న నో ముత్తున్న పురుహూతాదులు తన్ను వేఁడ వెనుదీయక యాయువుఁ

వారి కొసంగె. రాజా! నీవు వారి యందఱికన్న మిన్నవని యెన్నఁబడు చుంటివి. దానంబున నీ కెవ్వరును సాటిలేరని పేరొంది ముజ్జగంబు లేలుచుంటివి. నిన్ను నే యాచించునది నీకొక గొప్పయంశంబు గాదు. తపం బొనరింప మూఁడడుగుల నేల యిమ్మదియ నాకుఁ బరమామోదకర" మన బలి యా పరమయాచకుని బేలతనంబునకు నవ్వి "అడుగ కడుగక మూఁడడుగులా యడిగితివి. చాలుచాలు! మేరుగిరి చెంతకరిగి చిన్నమెత్తు బంగారంబు నర్థించు వెఱ్ఱులుందురా! వసుధాఖండమీ వేఁడలేదు. గజాశ్వసందోహంబా యర్థింపలేదు. దాత పెంపును సొంపును దలంపక యిట్లడిగి నన్నుం జిన్నపుచ్చఁ దగునా! ఇంతయల్పదానంబు నాజన్మప్రభృతి యెన్నడును జేసి యెఱుంగ. నీయిచ్చవచ్చినది కోరుకొమ్మని" చెప్పుచున్న బలి వాగ్విలాసంబు లవలోకించి చిఱునవ్వు మొగంబున మొలకలెత్త

"మ. గొడుగో, జన్నిదమో, కమండలమొ, నాకున్మంజియో, దండమో
వడు గే నెక్కడ! భూము లెక్కడ! కరుల్వామాక్షు లశ్వంబు లె
క్కడ! నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ దోయి కిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్.

అదియుం గాక మనకుం బ్రాప్తమైన లేశమునే పది వేలని తృప్తినొందనివాఁడు చెడును. ప్రాణములు నళినీపత్రగతాంబు చంచలములు. కలిత మనోరథంబు లుదకంబులు. ఆశల కంతంబు లేని గతి నాశకును సంతంబు లేదు. దాని జయించినవాఁడే సమర్థుఁడు. అల్పసంతోషి కెలప్పుడును సుఖంబె చేకూరు. చెఱకు తీపి యని వ్రేళ్ళతో నములు వెఱ్ఱియుం గలఁడా? నీవు రాజేంద్రుఁడ వనియు నంమును నడిగినదెల్ల నిత్తువనియుఁ దలకుమీఱిన కోరికలఁ గోరఁ దగునే? నే నొంటరిని. నాకుఁ దగినకొలఁది యేను వేఁడుకొంటి. చాలదనక యీ పాదత్రయమే నాకు సర్వస్వమ్మని” మ్మని ప్రార్థించిన నా సురేశ్వరుఁ డాయుర్వీసురున కుర్వీదానంబు సేయ నురవడించుతఱిఁ బూర్వదేవగురుసార్వభౌముండును, నిజవిచారయుక్తుదనుజరాజ్యచక్రుండు నగు శుక్రుండు బలి కిట్లనియె. “దనుజేంద్రా! ఈతఁడు భూసురుఁడు గాఁడు. దేవకార్యంబు సాధించుటకు హరి యదితిగర్భంబునఁ గశ్యపసూనుఁడై యవతరించి యాచకుని భంగి నిటకువచ్చి నిన్ను వంచించి నీరాజ్యంబు దేవేంద్రున కిడును. మూఁడడుగులమేర కోరి యంతట నఖిలకాయుఁడగుచు నొక్కపదంబున భూమియు నొక్కపదంబునఁ ద్రిదివంబును ద్రొక్కి సకలాశాంతంబులు గగనంబును తానయై నీ వెందుఁ జొచ్చుటకు నవకాశమీక యాక్రమించియుండు సకలాసుర సమూహమునకు నుపద్రవము కలుఁగుట నిక్కంబు

తొలుత నిచ్చెద నని పల్కి పిదప నీకుండుట యనృతదోషం బని సంకోచింప వలదు. ఏదానమున నాశము సంభవించు న ద్దాని విడువవలె నని నీతివిదులు నుడువుదురు. అదియుంగాక వారిజాక్షులందును, వైవాహికములందును, ప్రాణవిత్తమాన భంగంబునందును, గోకులాగ్రజన్మరక్షణమందును, బొంకినను పాపంబు తొడరదు. ఈదానము నీవము ద్రోసిపుచ్చి కులమును, రాజ్యమును, దేహమును నిల్పుము. ఈకుబ్జుండు విశ్వంభరుండు. నాపలుకు లాకర్ణింపు" మని హితోపదేశంబుఁ జేసె.

బలి నిమీలితనయనుండై యొక్కింతతడవు యోచించి "గురువర్యా నీస్వామి భక్తిపరాయణతకును, హితోపదేశంబుల కెంతయు మెచ్చవచ్చె. పలికి లేదనుటకంటెఁ బాపమేదియుఁ బ్రపంచమునఁ గానరాదు. తొల్లి భూదేవి బ్రహ్మతో నెట్టి దుష్కర్మనైన మోయఁగలదానను గాని సత్యహీనుని మోయఁజాల నని పలికినది. వెండియు హాలికునకు మంచి కేదారంబును, మంచి విత్తనంబులు నొక్కట దొరికినట్లు నాకు దానమునకు సత్పాత్రంబు లభించినది. సత్పాత్రదానంబు విడనాడు రసవిహీను లెందేని యుందురా! ఈతఁడు మాయావటుండేయందువా! కానిమ్ము! భూసురుఁ డనుటకు సందియంబు లేదు. విశ్వంభరుండేయందువా! ఇంతకంటె మహాభాగ్యము లభించునా! కృతయుగాలంకారభూతులగు మాంధాతమహీపాలాదులును, శిబిప్రముఖులును, వితరణగుణసంపన్ను

లై యశఃకాములై యర్థులకోర్కెల సమర్థతం దీర్చి చనిపోవ వారలను నేటికిని మఱచినారా! వారలం బోలె నే ననివార్యం బుగ నీరాజ్యంబీమాణవకున కొసంగెద.

“శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై హంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపై .........నూత్నమ
ర్యాదంజెందుకరంబు క్రిందగుటమీఁదైనా కరంబుంటమే
ల్గాదే! రాజ్యము గీజ్యము న్సతతమే” కాయంబు నాపా
యమే?”

కావున

“మ. నిరయం బైన నిబద్ధమైన ధరణీనిర్మూలనం బైన దు
ర్మరణం బైనఁ గులాంత మైన నిజమున్ రానిమ్ము కా
నిమ్ము పో
హరుఁ డైనన్ హరి యైన నీరజభవుం డభ్యాగతుం డైననౌ
దిరుగ న్నేరదు నాదుజిహ్వ వినుమా! ధీవర్య వేయేటికిన్.

మఱియు మేరుధరాధరంబు తలక్రిందైనను, పారావారము లింకినను నేను సత్యంబు నిల్పికొందు. అందును నెన్నఁడును యాచనయన నెట్టిదో యెఱుఁగని వాఁడట. అమ్మవంకవారుగాని యబ్బవంకవారుగాని యెవ్వరును లేరట. విద్యలందన్నునో సకలవిద్యల నెఱింగినప్రోడయఁట. అట్టివాఁ డర్థింప నిత్తునని మరల నీకుండఁ జాల” నని పలుకుచు, దివ్యశోభాన్వితయు, ముఖజితేందుబింబయు నగుభార్యకుం గనుసన్న యొ

సర్వఁ గ్రసన్నన నాదనుజలోకనాథుదయితే వింధ్యావళి మదగజరాజగమనంబున స్వర్ణకలశంబున జలంబు గొనిదేర వితరణఖని యగునాబలి యోగిసుమనస్సంప్రార్థితశ్రీదమును, సమ్రరమారమణీలలాటపదవీకస్తూరికాశాదమును, నలినామోదమును, రత్ననూపురితనానావేదము నగు మాణవకుని పాదము గ్రహించి, భవసంహరణ మగు హరిచరణంబును నీటఁ గడిగి తత్పావనోదకంబు శిరంబునఁ జల్లుకొని బ్రహ్మప్రీతం బని భువనంబు ధారవోసె. అత్తఱి మాయావటుండు

"కం. ఇది యేమి వేఁడి తని నీ
మది వగవక ధారవోయుమాసజ్జనుబెం
పొదవఁగఁ గోరిక యర్థం
బిది యిచ్చుట ముక్షగంబు లిచ్చుట మాకున్."

అని పలికిన బలి పొట్టివడుగు చిట్టిచిట్టిపలుకులకు నవ్వి మూఁడడుగుల నేల దానమిచ్చె.

వామనుఁడు దానపరిగ్రహణంబు సేసి, సురాసురులెల్లఁ జూచుచుండ నైంద్రజాలికుమాయయో యన నాజానుబాహుఁ డావర్తితదేహుఁడై, సురసాగహ్వారంబున సూక్ష్మరూపంబునఁ జొచ్చి విశ్వరూపంబు దాల్చిన మారుతాత్మజుని భంగి, నశ్వపతి కవతరించిన యాదిశక్తికరణి, విద్యుచ్ఛాలను మొదటఁ జిన్నిరూపంబు గానుపించి కనుమూయుకాలంబున గొప్పదియై తఱుముకొనివచ్చు వస్తువితానంబు విధంబున,

భూతలం బతిక్రమించి, సూర్యచంద్రమండలంబులం దాఁటి, ధ్రువపదమును మించి, బ్రహ్మాండం బంతయుఁ దానై యా క్రమించి, విశ్వరూపుఁడై యొకపదంబు క్రిందనుర్విని, వేఱొక పదం బాకాశంబును గప్పి యన్ని జగంబులఁ దానై యుండె. విశ్వరూపసందర్శన కుతూహలాయత్తచిత్తుఁడై బలి యనేక విధంబుల హరిని స్తోత్రముచేయఁ దొడంగె.

దానవు లెల్లరు హాహాకారంబులుసేయుచు "మాయావటుండని యెఱుంగక మాట తిరుగలేక దానవేంద్రుండు దానమిచ్చె. వానియందు నేరంబులేదు. ఇతఁడుసురలోకంబు పరిగ్రహించి యింద్రున కీఁదలంచి యున్నవాఁడు. విడువ కిప్పుడీతని నిర్జించుట కర్జ" మని గర్జనంబులు సేయుచున్న దానవానీకంబు గనుంగొని దీనత్వమించు కేనియు నాననంబునఁ దోఁపనీక "రాక్షసోత్తములారా! కలహంబునకుఁ గాలుద్రవ్వుట కిది కాలంబు గాదు. సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబే పరిభవింప నిం కెవ్వఁడు రక్షింప నోపు. మున్ను మనకు రాజ్యంబుకలుగుట యీమహానీయు కరుణాకటాక్షముననే కదా! నేఁడు మనలఁ దొలఁగించుటయు నీమహామహునిచేతఁ గదా! ఎప్పుడు దైవం బనుకూలుండగు నప్పుడు మనకు స్వర్గాధిపత్యము చేకూరు. నాఁడు గెలుతెము. నేఁడు వీనియెడ వైరంబు వలదు. కాన నలుగక తలఁగు" డని బలి బోధించిన రక్కసులు రసాతలంబునకుఁ జనిరి.

సంపదచెడి వారుణపాశంబునఁ గట్టువడి, దైన్యాకంపంబుల వీడి, తొంటికంటె సంతోషంబుతో నున్న సురవైరి నవలోకించి "దానవనాథా! మూఁడడుగుల నేల నిత్తువంటివి. చంద్రార్కమండలంబుల పర్యంత మొక్క యడుగయ్యె. స్వర్లోక మొక్కచరణ మయ్యె. కడమపాదంబునకు మేర యేది? పరమసూనృతవచో ధురంధరుండవు నీవు. ఇచ్చెద నన్నయర్థమీనినరుండు నిరయంబునం బడు. మూఁడవపద మ్మెన కిమ్ము జూపెదవా! నిరయంబున కేగెదవా!" యని మోమోటము వీడి మాటలాడుచున్న వటువు నవలోకించి బలిసత్యభంగసందేహవిషదిగ్ధశల్యనికృత్తచిత్తుండయ్యు భీతుండుగాక

"ఆ. వె. సూనృతంబె గాని సుడియదు నాజిహ్వ
బొంకఁ జాల నాకు బొంకులేదు
నీతృతీయపదము నిజము నాశిరమున
నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ!"

అని పలికె. సత్యదానకరుణా ధర్మవిహీనుండైన మూఢుఁడు చంచలాచపలమగు నీకపట సంసారంబు నిక్కంబుగాఁ దలంచి యెఱుకచెడి వర్తించును. తొల్లి మావారు వైరులైగాని నిన్నుఁ గానరైరి. నేఁడు నాపుణ్యవశంబునఁ గదా నీవర్థివై వచ్చి నన్నడిగికొంట" అని పలుకు సమయంబున నిర్మలసాధువాదుండును, బోధకళావినోదుండు నగు ప్రహ్లాదుం

డట కేతెంచె. వచ్చినతాతం గనుఁగొని బలి యంజలిఘు టింప సంసిద్ధుఁడుగా, వారుణపాశబద్ధుఁ డగుట దండ మిడ రామి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కె.

ప్రహ్లాదుఁడు భాసిల్లువామనదేవునిం గని దండప్రణామం బాచరించి "దేవదేవా! బలి కింతకుమున్న నీవింద్రపదవి నొసఁగి నేఁడు మరలఁ గైకొని యతనికి మహోపకారంబే యొనర్చితివి. స్వర్గాధిపత్యంబు గైకొన్న గర్వంబునఁ గన్నుగానక తన్నుఁ జూడక, చెవులు వినరాక, చిత్తంబు వశంబు గాక మోహవశుఁడై నీ సేవలన్నియు మఱచె. కాన మేలే యొనర్చితి" వని పలికె.

కన్నీరు గ్రుక్కుకొనుచు బలిసహధర్మచారిణి వచ్చి వామనుని చరణ సమీపంబునఁ బ్రణతయై స్తుతించి

"కం. కాదనఁడు పొమ్మన లేదీ
రా దనఁడు జగత్త్రయైక రాజ్యము నిచ్చె
న్నాదయితుఁ గట్టె నేటికి
శ్రీదయితా చిత్తచోర శ్రితమందారా"

అని వేఁడెను. వీతిహోత్రుని స్పర్శ మాత్రమున హైయ్యంగవీనంబు గరగుకరణి వింధ్యావళి దీనాలాపంబునఁ గరఁగిన మనసుగలవాఁడై ప్రహ్లాదుండును బద్ధాంజలియై "లోకేశా! బలి దండయోగ్యుఁడు గాఁడు. భక్తితత్పరుఁడు. కరుణింప నెంతయు నర్హుండు. అడిగినదే తడవుగా నాపద సంఘు

టిల్లునని శుక్రుఁడెంత బోధించినను వినక తన సర్వస్వము ధార నొసిన యీతనికి దృఢవారుణపాశబంధనంబు తగదు" అని పలికిన భగవంతుఁడు వాని కిట్లనియె! భక్తాగ్రేసరా! నే నెవ్వరినిఁ గరుణింప నిచ్ఛయింతునో వానివిత్తమ్ముం సర్వమ్ము హరింతును. హరించినను నిరంతరమత్పూజాతత్పరుఁ డగు నేని యాతనికి ముక్తి నొసంగెద. సంసారగురుమదస్తబ్ధుఁడై యెవ్వఁడు నన్ను ధిక్కరించు నతఁ డెల్లవేళలఁ బుట్టుచుఁ జచ్చుచుండు. ఎవ్వఁడు విత్తవయోరూపవిద్యాబలైశ్వర్యకర్మజనత్రంబుల వలనిగర్వ ముడిగి వినయుఁడై యుండు నాతఁడు నాకరుణాకటాక్షమునకుఁ బాత్రుఁడు. కాన వీని సచ్చరితమున నా కెంతయు మెచ్చువచ్చె." నని పల్కి బలిని విలోకించి సంతసంబున "ఇంద్రసేనమహారాజా! జయము! జయము!! వైవస్వతమన్వంతరమున సూర్యసావర్ణి మనువువేళ నీకు దేవేంద్రపదవి సంఘటిల్లు. అంతవఱకు నాపంపున సుతలాధిపతివిగా నుండుము. ఈతిబాధలకు, వ్యాధులకు నీరాజ్యంబునఁ గాలిడుటకైనఁ దావుండదు. నీపంపు సేయని దానవు లెవ్వరేనియున్న వారిని నాచక్రంబు పిలుకుమార్చుచుండు, నీయసురభావంబు తొలఁగిపోవును." అని వరంబు లిచ్చిన, బలి కనుకొలఁకుల నానందవారి యనివారితంబుగఁ బఱవ హరికిఁ గరయుగంబు మొగిడ్చి, బ్రహ్మకుఁ బ్రణమిల్లి, యింద్రునకు వందన మాచరించి ప్రహ్లాదునకు దండ మిడి బలిచక్రవర్తి, సు

తలంబున కరిగెను.

భక్తవత్సలుండగు నారాయణుండు శుక్రుని వీక్షించి "ఆచార్యా! బలిమఖంబునం దేమి కొఱంత గల్గె నద్దానిం దీర్పయత్నింత" మనిన శుక్రుండు "నిర్వక్రపరాక్రమోజ్వలా! చక్రధరా! యజ్ఞేశుండవు, యజ్ఞపురుషుండవు, సర్వము నీవ యైయుండ నీవు పరితుష్టి నొందిన పిదపఁ దుష్టి పొందనిదేది? కడమకార్యం బన నెంత? నీపంపున యజ్ఞావశిష్ట మొనరింతు నని మునులయు విప్రులయు సాహాయ్యంబునఁ గావ్యుఁ డసు రేంద్రుని యాగంబు తుదిముట్టఁ జేసె.

ఈవిధంబున హరి వామనుండై బలి నడిగికొని లోకం బులు పరిగ్రహించి, తనకగ్రజుఁడగు నమరేంద్రున కమరాల యం బొసంగె. బల్లిదులప్రాపు పెనుకార్యముల కోపుననునట్లు భగవంతుఁడు తమ్ముఁడే యైనయెడల నెరికి కీడు సంభవించు ట తటస్థించును.

ఆహా! భాగంబు పంచియిమ్మని యన్నతో గ్రుద్దులాడక, తానందఱకన్న మిన్న నని కన్న తలిదండ్రులతో విరోధించి వారిని న్యాయస్థానముల కీడ్వక యన్న కని తాను బిచ్చమెత్తి, తానార్జించిన రాజ్యంబునైన నేల కన్నకై పలు పాట్లుపడిన దేవేంద్రుని తమ్మునితో నెవని తమ్ములు పోలఁగ లరు! అనంతకోటి నక్షత్రంబులఁ జందమామ చందంబున, మహీతలమహీజవితానాంచిత విపినంబునఁ బటీరపాదపంబుపగిదిఁ

గులపావనుఁడగు కొడుకొక్కరుండె చాలు!

జగదీశ్వరార్పితమఖ శతపూర్తియు, స్వవశచక్రపరిచ్ఛిన్న భయంకరశత్రుచక్రవిస్ఫూర్తియును, సత్యపథానుసరణతత్పరుండును, వితరణకుతూహలసత్వరుండును, విమలయశస్కుండును, ధృఢమనస్కుండును, నియతసత్యసంఘుండును, నర్థిజనకమలకమల బంధుండును, దేశకాలపాత్రతంత్రంబు లెఱింగి, శుక్రుని సద్బోధనాపరంపరలఁ దెలిసి, యనాగతవినాశ మెఱింగియుఁ బాత్రమును గుర్తించి రాజ్యసర్వస్వమ్ము నవలీలగా దాన మిచ్చి, నవపయోదనీలోజ్వలమూర్తియు, నాజానులంబబాహా యుగస్ఫూర్తియు, సద్యఃప్రఫుల్లారవింద సదృశనయనద్వయ స్ఫూర్తియు నగువామనమూర్తిని సప్తమద్వారద్వారపాలకునిగాఁ జేసికొని పాతాళంబునేలు బలిచక్రవర్తివంటి మహాదానప్రవర్తియింకొకఁడుప్రపంచమున నేయుగమందును గానరాఁడు. అట్టి మహాత్ముని యమలకథామృతధారలు పత్రికభారతీయుఁడనుగ్రోలి బలింబోలె సత్యసంధుఁడై, వితరణగుణాలంకృతుఁడై పరకార్యనిర్వహణబద్ధకంకణుఁడై శ్రీపరమేశ్వరభక్తి తత్పరుఁడై, రాజిల్లి భారతమాతకు నానందసంధాయకుఁ డగును గాత!



# గంగావతరణము



దిగంతవిశ్రాంతకీర్తియగు భరతవర్షంబునఁ గోసల దేశంబునఁ బరమసుఖాస్పదంబై, సకలసంపత్సమృద్ధంబగు సాకేతపురంబు సరయూతరంగిణీతటంబునఁ గరంబు విరాజిల్లుచుండు. అన్నగరంబునం గలకోటలు హాటకవజ్రమణిప్రభలం బ్రదీప్తములై, నభశ్చుంబిసంవరణపరివృతంబులై, దిననాథ రజనీనాథులబాటల కాటంకము గల్గించుచున్నవో యనఁ జూపఱకు వింత గల్గింపఁజొచ్చె. పటువేదశాస్త్రపురాణాది విద్యాగరిష్ఠులైన విద్వాంసప్రవరులతోడను, గదనతలంబునం దడు గిడి వెన్నిచ్చి పాఱక పురహరు నైన నోడింప సమర్థులగువీరపురుషవర్గంబుతోడను, కోటికిఁ బడగ లెత్తి యలకాధిపతి నైన నిరసింపఁగల వణిక్పుంగవులతోడను, మిన్నులరాయుధాన్యపురాసులు గల్గి పూతస్వాంతులగు సేద్యగాండ్రుతోడను, వేగతిరస్కృత పవమానమానసఘోటకరాజంబులతోడను, నవిరళమదధారాసిక్తమార్గంబులు గల వారణశ్రేష్ఠములతోడను, ఘోరరణరంగోద్భటులగు వీరభటులతోడను, శైలోపములై ప్రవిమలకేతుయుక్తములగు శతాంగపంక్తులతోడను, భూకాంతకు మేలిభూషణంబో యనఁ బ్రశస్తవస్తువిసర నికేతనంబై యాసాకేతంబు వఱలుచుండె. అందలిజలంబులు మాధుర్యంబునఁ జెఱకుపాలను, నిర్మలత్వంబున

వరాక్తికరాజంబుల నపహసించుచుండు. అనిశ మాపురోద్యా నవనంబులఁ గుసుమితపున్నాగ కదంబ, కాంచన, తమాల, తరుపరికరంబులు తమతమసౌరభ్యంబుల వెదచల్లుచుండు. ఆపురజనులందఱును, ధర్మశీలయుతులును, సత్యవాక్యరతులును, నిర్మలమానసాఢ్యులును, గభీరసాగరులును, పరదారధనాదివిముఖులును, నగుటచేఁ జారచోరాగ్నిభయంబు లెందును మందునకైనఁ గానరాకుండె. ఆపురవాసు లాపదల కాస్పదులనుమాటయవ్వీటనీటిమాట. అనాచార్యులనారోగ్యులసూయావేశు లనృతభాషు లల్పజీవు లకాలమరణసంప్రాప్తు లవగుణు లహంకారు లప్రయోజకులు మున్నగువారి యడపొడయయ్యెడఁ బొడసూపదయ్యె.

ఆహా! అట్టిపురవరంబునకు నేలఱేఁ డెట్టివాఁడై యుండునో వేఱె చెప్పవలయునే! ఆసార్వభౌముండు వారాశికి సాగరం బనుపేరు దెచ్చిన సగరాభిధానుఁడు. వేదవేదాంతార్థకోవిదుండు. విశ్వవినుతకీర్తిమంతుండు. లోకాలోకపరిరక్షణదక్షుండు. యథార్థవాది. శమదమసద్గుణాలంకృతుఁడు. ఘనులకును దైవభక్తిపరాయణులకును, దైవంబు కుడిభుజంబై యుండుఁ గదా! బాహుకుం డనురాజు రాజ్యభారంబు నిజదోర్దండంబున వహించి యేలుచుండఁ గాలవశంబున రిపునృపుల కోడి నిజభార్యాయుతుండై కానలకుం బోయి యందే కాలంబు గడుపఁ జొచ్చె. అయ్యరణ్యంబునం దాపుడమిఱేని దేవేరి

గర్భవతియయ్యె. కట్టా! పగ యెంత కుటిలము! అందును సవతులపగ యింతిం తనరానిది గద! ఆపె సవతులు నిండు చూలాలిం గని యన్నంబు గుడుచుచో మఱుఁగుటోగిరంబున గరంబు పెట్టిన నాపె యెఱుంగక యద్దానిఁ గుడువ గరము తోన సుతుఁ డుద్భవించె. గరయుతుం డగుట నాసుతుఁడు సగరుండయ్యె. కాలక్రమంబున నిండుజవ్వనంబునఁ గీర్తికర్పూర ప్రకాండంబు దిక్తటంబుల నిండఁ జేసి మండలేశ్వరనామంబు సార్థకంబుచేయుచు రాజ్యపరిపాలన మొనర్చుచుండె.

జననీజనకుల ఋణంబు దీర్చువాఁడే సుతుఁడు తలిదండ్రుల యాజ్ఞానువర్తియై మెలఁగువాఁడే కొమరుఁడు. పనివడి యాతని జీవితకాలంబున నిర్వర్తింపఁ దలంచిన పని పూర్తి చేయలేక జనకుఁడు కాలవశుఁడైన నా కార్యభారం బంతయు నెత్తి నిడుకొని కొనసాగించువాఁడే పుత్రుఁడు. నిజజనకారి వీరు లగు హైహయబర్బరాది మహీపతుల నెల్ల సంగరరంగంబున నోడించి సగరచక్రవర్తి తనతండ్రిపగ దీర్చుకొనియె.

ధర్మకర్మపరాయణుండగు సగరచక్రవర్తి, వసిష్ఠానుమతంబున ననేకయజ్ఞయాగాదిక్రతువుల నాచరించి యనంతర మశ్వమేధంబు సేయఁ గృతనిశ్చయుఁడై పట్టణమంతయు శృంగారింపుమన్నను చాటఁబంచి తానుతగుదుస్తుల ధరించి దీక్షాగారంబు ప్రవేశించె.

పట్టణమంతయు నతిమనోహరముగా నలంకరింపఁ

బడెను. ఏవంక విలోకించినను బచ్చపచ్చని కుచ్చుతోరణంబులు విచ్చలవిడిగా గ్రువ్వఁ బడి యుండె. ఇసుక వేసిన రాల కుండ జనులు వీథులయందు గుంపులు గుంపులుగా గుమిగూడి యుండిరి. ఆజన్నంబునకుఁ బసిఁడియిటికలచేఁ గట్టఁబడుటం జేసి మిసిమికాంతుల వెదచల్లు హేమకుండ మొం డేర్ప డుపఁ బడి యుండె. నిరంతరాజ్యధారానివహంబులగ్నియందు వేల్వఁబడుచుండె. అంతట రక్షకభటులు సవనాశ్వంబును వదలివేయఁ దన్నుఁ బట్టువా రెవ్వరైనఁ గలరా యనునట్లు హేషారవంబు నొనర్చుచుఁ జెంగుచెంగునఁ దురగంబు గుఱ్ఱం గలించుచుఁ బరువెత్త సాగె.

పుణ్యజనాకమును పుష్పపల్లవ ఫలభరితద్రుమానీక మును గంగాసలిలైకము నగునాకమునఁ బాకశాసనుండు దేవబృందారకానీకంబు గొలువ చింతామణీభద్రసింహాసనం బునం దుపవిష్టుండై యాచార్యు నవలోకించి "మహాత్మా! సగరుఁ డొనర్చుశతమఖంబులు నేఁటిజన్నంబుతోఁ బరిపూర్తి కాఁ గలవు. ఐంద్రపదవి వానికి సంభవించుట నిక్కంబు. మీకును మాకును నేటితో ఋణంబు తీరుచున్నది. దీనికిం దగునుపాయం బున్న నానతీఁగదే?" యని దైన్యంబున వేఁడు కొన బృహస్పతి విచారించి యొక్కింతతడవు యోచించి "శత మఖా నీశతమఖత్వమున కేమియు భంగంబు గలుగదు. ఇప్పు డాయశ్వంబును బట్టి పాతాళంబునఁ దూర్పుముట్టిన యుత్తర

భాగంబునఁ గపిలమహామునిపొంతఁ గట్టి వచ్చితి వేని యెల్ల కార్యంబులు చక్కఁబడు” ననియుపదేశించిన గతభీతుండయి శతమఖుండు మనుష్యాకృతిఁ దాల్చి యాయజనాశ్వంబు నప హరించుకొనిపోయె.

ఇంద్రపదవినాశించిన సగరుండు సవనాశ్వంబు తిరిగిరా కుండుటఁ గని సవనదీక్షచేఁ దా నిలుగదలరామిఁ జింతా క్రాంతుడై వానియఱువదివేవురపుత్రులం బిలిచి “నాయ నలారా! బహుబలపరాక్రమసంపన్నులు. సుగుణగణభూయి ష్ఠు లఱువదివేవురుకొమరులు గలరని విఱ్ఱవీఁగుచుండియు నీచిన్నికార్యం బెట్లు నెఱవేఱునని నేఁడద్దయు దుఃఖించు చుంటి. అశ్వంబు గానరామికిఁ గారణం బెఱుకపడదు. దేశ దేశంబుల వెదకి యశ్వంబు దెచ్చి యిచ్చి నాహృదయతా పంబు జల్లార్పు” డని కోరిన నాజగజెట్టు లెల్ల రొడికట్టి కో దసీకుహరంబు ఘూర్ణిల్లునట్లు సింహనాదంబు లొనర్చి, యూ రు వెడలి, పురవీథులం బడి, నగరులఁ జొచ్చి, పచ్చికపట్టుల నిచ్చవచ్చిన మచ్చునఁ బ్రవర్తించి, కొలఁకులఁ గలఁచి, యా పగల గగ్గోలుపఱిచి, దిశలు వ్రక్కలించి, మేఘవీథుల గాలించి, మఖతురంగంబు గానక మగిడిపోయిన మాటదక్క దని తలంచి, ఘనదోర్దండబలంబుమెఱయం గుతల మెల్లఁ ద్రవ్వి, త్రొచ్చి, కోరాడి, పాతాళంబు జేరి యందీశాన్యభా గంబునం దొకవ్యాఘ్రాజినంబునఁ బరమనిష్ఠఁ బద్మాసనస్థుం

డై, దేహంబున విభూతి విభూతిభంగి మెఱయ, జటలుగట్టి శిరోజంబులు తామ్రకాంతు లీనఁ జిన్ముద్రాధరుండై, పాణిక మలసముదితాక్షమాలిక కర్ణశష్కులిక వ్రేల, నిమీలితనేత్రుఁడై, భ్రూమధ్యన్యస్తదృష్టియుతుండై యున్న కపిలమహామునీంద్రుని కనతిదూరంబునఁ గట్రాటం గట్టఁబడి యున్న యాగతురంగంబు నవలోకించి

"చ. ఎఱిఁగితి మద్దిరయ్య తడ వేటికి గుఱ్ఱపుదొంగ యీతఁడే
గుఱుతుగఁబట్టి చంపుఁడతి ఘోరమునీంద్రుఁడువోలె నేత్రముల్
దెఱవగ నున్నవాఁ డితనిఁ దెంపునఁబై సిగవట్టి వంపుఁడం
చఱువది వేవురున్ జకరాయుధముల్ ఝుళిపించి డాయుచోన్"

కపిలుఁడు గన్దెఱచి గ్రుడ్లెఱ్ఱచేసిన వాని మేనిరోమకూపంబునుండి యొక్కొక్కజ్వాలచొప్పున నఱువది వేలయగ్నికీల లేకమై సుమతికొమరులం దాఁకి, మూఢచిత్తులైన వారి నొక్కమొగి భస్మీభూతులఁ గావించె. సాధుసంతాపమెట్టివారలనైన భస్మీభూతులఁ జేయకుండునా?

అశ్వమేధీయంబు కనుఁగొన లేక తండ్రి మొగంబు చూడఁ జాలక సిబ్బితి నెచ్చటనో తలఁదాఁచుకొనిరి సుమతికొడుకు లనువారు కొందఱును, ప్రాణంబులపై నాస వీడి దేహత్యాగంబు చేసిరో యనువారు కొందఱును, నేఁడో రేపో హయంబు చేకొని తిరిగి వత్తురేమో యనువారు కొం

దటును, శత్రుభూపతులచేతం జిక్కి మడిసిరేమో యనువారు కొందఱును, తృణలవంబులు వెంటిగా నేర్పడిమదమాతంగంబును గట్టివేయునట్లు అఱువదివేవు రైకమత్యంబున మెలంగి సవనాశ్వంబును నిక్కంబుగఁ దెచ్చెద రనువారును నిట్లనేకు లనేకవిధంబులఁ జెప్పుకొనుచుండిరి.

సగరుఁడు పెద్దకాలంబు చింతించి చేయునది లేక విక్రమశ్రీమంతుఁడగు నంశుమంతునిఁ దన మనుమని నశ్వంబును వెదకి తేరం బంచిన నాతండు పినతండ్రులయంఘ్రిజాడల నఘ్రిలించి, త్రవ్వినమహాఖాతంబు సొచ్చి, తూర్పు దిగ్దంతిని గాంచి మ్రొక్కి, సకలవృత్తాంతంబు నెఱింగి సకల దిగ్గజంబులకుఁ బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి పితృ పితృవ్యుల భస్మరాసులు పొడగని యత్యంతదుఃఖంబున శోకించి యాచెంత నున్నసైంధవంబు గని కపిలాఖ్యుండైన విష్ణునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి నుతి సేసినఁ గరుణావిపులుండగు కపిలుండు "కుమారా! నీతండ్రులు వెఱ్ఱులై న న్నట్లాడి యనేకబాధలఁబెట్టి మద్భీకరకోపానలజ్వాలలకు శలభంబులైరి. నీవుకడుఁ బ్రబుద్ధుఁడవు. నీసౌజన్యతకు మెచ్చితి. నీసవనాశ్వంబును గైకొ" మ్మని నుడివె. కనుఁద్రాసుల సంతోషవిషాదంబులు సమంబునఁ దూఁగ నంశుమంతుఁ డాహయమును గొనిపోయి సగరున కిచ్చిన నాతఁ డాపశువువలన జన్నంబెట్లెటో పరిసమాప్తినొందించి యవభృథస్నానపూతుం

హై యంశుమంతునిఁ బట్టాభిషిక్తునిఁ జేసి సంసారసుఖంబులు విసర్జించి మునియై యుత్తమగతికిం జనెను.

తండ్రుల బుగ్గిదిబ్బలచెంతకుం జని యంశుమంతుఁడు మృతులైన తమవారల యుత్తమగతులకై యనిమిషనదిం దేఁ బూని యతిఘోరతపం బాచరించి తన్మధ్యంబునఁ బంచత్వంబు నొందె. తత్సుతుండు దిలీపుఁడు ననేకవిధంబులఁ బ్రయత్నించి విఫలమనోరథుఁడై కాలవశుఁడయ్యె. అతనికొమరుఁడు వీర్యవంతుఁడును, జితేంద్రియుఁడును, నిరుపమనిష్ఠాగరిష్ఠుఁడు నగుభగీరథుఁడు కొన్నిదినంబులు కందమూలఫలంబులఁ గుడుచుచుఁ గొన్నిదినంబులుసలిలపానమొనర్చుచుఁ గొన్ని వాసరంబులు వాయుభక్షణంబు సేయుచుఁ గొన్నియహంబులు పావద్వయినిఁ గొన్ని ఘస్రంబు లొంటికాలనుకొన్ని పపక్షు పాదాంగుష్ఠాగ్రంబున నిల్చి కొన్ని పగళ్ళుతలక్రిందుగాను తపం బొనరింపఁ బొడమినతత్తీవ్రతపోగ్నిజ్వాల లెల్లెడల వ్యాపించి జగంబులం గాల్పఁ దొడంగె. వాసుకిఫణాగ్రమణివితానంబు డుల్లె. కులపర్వతంబులు దిగంబడియె. సంద్రము లింకె. దిక్చక్రమల్లాడె. నిర్జరానీకంబు తల్లడిల్లె. అంత నెల్లవారల యలజడి మాన్ప నాకృపాపాంగ యగుగంగ సాక్షాత్కరించె. భగీరథుఁడు గంగను గనుంగొని

"కం. మావారిభస్మరాసులు
నీవారిం గలిపికొనుము నెఱి మావారల్

సీ.వారిఁ గలయ నాకము
మావారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ!"

అని నుతి సేసినరాకుమారున కాలోకపావని భగీరథా!

"మ. వినువీథిం బఱతెంచి నేలఁబడ నావేగంబు మున్నిల్పనో
పినవాఁడెవ్వఁడు మేదినీతలము నేభేదించి పాతాళముం
జనుదు న్వచ్చితినేని నాజలములన్ స్నానంబుగావించున
మ్మనుజుల్ వీడఁగలారు వాస్తవముగం బాపప్రకాండం
బులన్"

కాన నన్నుభరించువాడిం జూపిన నారాక కభ్యంతరం బేమిగల దని పలుకుచున్నమందాకినిం గని "జననీ! విశ్వాభావనుండై యొప్పుశివుఁడు దక్క నీహారిఘాతంబు భరించువారొరు లెవ్వరును గానరారు. శంకరు నుద్దేశించి తప మొనర్తునను గ్రహింపఁ గదే" యనిన "కుమారా, అటు లొనర్చినయెడ నీకు సుఖ మ్మగుఁ బో" మ్మనె. అంత నాతండు చని మహేశ్వరు నుద్దేశించి ఘోరతపం బొనర్చిన నాతపంబున కాగాములదొర మెచ్చి శౌరిపాదపూతజాతసలిలయై దివినుండి వచ్చుగంగను దలఁదాల్తు నని వరం బొసంగె.

అంత భగీరథమనోరథసిద్ధ్యర్థ మాగంగ శివజటాటూటవనాంతర్గతంబై తిమితిమింగిలకమరగ్రాహసంకలిత మగుజలనిధి భేదించి యతిసూక్ష్మంబుగాఁ గన్పట్టి పర్వతునాకావిచ్ఛేదనాయంత్రంబువోలెఁ దటదట తెక్కలు కొట్టకొనపక్షి

చంపకంబున వాయువేగమనోవేగంబునఁ బోవువిమానంబు భంగిఁ బఱపెట్టుచుఁ దానో భూమిజంబులో భూధరంబులో కనుఁగొనఁ జాలనంత గంటకు ముప్పదికోసులు లవలీలగాఁ బరువెత్తు భూమిశకటంబులేవఁ డపటపధ్వనితో చక్రంబు దిగ్భ్రమణకోలాహలంబు జనమభివృద్ధినై చనుచలనశకటంబుమాడ్కి నున్ననగు తిన్ననిబాటను తురంగచతుష్కంబుబూన్చినయరదంబు గబగబపరువెత్తుచందంబునఁ బరుగుపరుగునబండిచక్రంబు టకటకశబ్దంబుతో నుడాయించు గుఱ్ఱపుబగ్గీవిధంబున నావల చక్రంబుదొరలించుకొంచు గుప్పుగుప్పునఁ బొగలాకసంబున కెగయఁజేయుపొగయోడకరణి నీటికెదుర నెమ్మదిగఁబ్రాకులాడు నిస్సు పడవవలెఁ దోల్త మహావేగంబునఁ బిదప నెమ్మదిగా నంతట మిఱ్ఱుపల్లంబుల నింపుచుఁ బర్వెత్తి బాలచంద్రునితోడ మేలమాడి మల్లికాకుసుమస్తబకపంక్తులతోఁ దులఁదూగి యైరావతకుంభంబులతో వియ్యమంది, కర్పూరసారంబును డిందు పఱచి నందివర్ధనంబులు తేలుభంగిఁబారిజాతంబులు పరువెత్తు మాడ్కిఁదెల్లకాగితపుబుట్టలెగురునట్లు హంసలు నడయాడు చందంబున, తెల్లుల్లసిల్లుకరణిఁబాతాళంబున బలిముత్తెంపు సరుల వామకరంబునఁ బట్టి దక్షిణహస్తంబున బలిమిమైఁ బైకెగమీటిన నవి తెగి ముత్తెంబులు టప్పుటప్పునఁ బైకెగసి క్రింద రాలుభంగి నుడుప్రకరంబులు వెదచల్లునట్లు ఫేనసముదయంబుతో నగ్గలంబైనబుగ్గలు నిగ్గుదేరఁ బందెంబున బాలుర

పరువెత్తి నియమితస్థలంబు జేరి చుట్టివచ్చి తల్లిసిముట్టునట్లు సుళ్ళు చుట్టుముట్ట గంభీరఘనధ్వని మ్రోయుచు నే నూర్ధ్వగామిని నధోలోకంబున కేల పోవుదు నను మాడ్కి మింటి మీఁది కెగసిన నైగసి, చిన్నయలలకరణి నావల నుత్తుంగ తరంగసంగతంబై నిరంతరపయోవర్ధనంబై ప్రళయకాలవర్షంబుభంగి సజ్జనమానసంబుకరణి నొక్కచో నతిస్వచ్ఛమై దుర్జనమైత్రి పోలిక వేరొక్కచోఁ గలుషితంబై మానిని యన లోతు సూపక గరిత యన నలి చప్పుడు చేయక ముగుద యన బయలుపడక ప్రమద యనఁ గ్రియ్యం బాఱుచు పతివ్రత యన నిట్టట్ సనక, తల్లి యన నెవ్వరైన లోఁగొనుచు దైవంబన భక్తమనోరథంబు లీడేర్చుచు, నంతకంతకు గుఱి గడచి యవాఙ్మనసగోచరంబై ప్రవహించి బహుదేశంబుల దాఁటి సగరక్ష్మాపాలకుమారభస్మరాసులముంచి, పాఱి ఘోరదురితపంకక్షాళితులఁజేసి యయ్యఱువదివేవుర కుమారుల స్వర్లోకవాసులం జేసె.

హరశిరస్సువలన భూమినిఁ బొందిన దగుట గంగ యనియు, విష్ణుపాదంబున బుట్టినదగుటవిష్ణుపది యనియు జహ్నుమహాముని తపోనిష్ఠమైనుండ వాని తపంబు గలంప యతిన్చిన నాముని కోపించి యోగబలంబున గంగాజలంబంతయు నాచమించిన, భగీరథుఁడు వాని డాయంజని ప్రార్థింప మరల నాగంగ న నిచెవులనుండి పుట్టినది గాన జహ్ను

తనయ యనియు, జాహ్నవి యనియు, సురల నది గాన సురనిమ్నగ యనియు, భగీరథునిచే భూతలమునకుఁ దేఁబడి నది గాన భాగీరథి యనియు స్వర్గమర్త్యపాతాళంబుల మూఁటియందు బ్రవహించినది గానఁ ద్రిపథగ యనియు, గంగ, సింధు, బ్రహ్మపుత్త్రి యను మూఁడు ప్రవాహములు కలది గాన త్రిస్రోత యనియు జగత్ప్రసిద్ధమైన నామంబులచే గంగ విలసిల్లుచున్నది.

ఎక్కడి ముసలిముత్తాత లెక్కడి మునుమనుమనిమను మఁడు, సకలసామ్రాజ్యభోగంబులు త్యజించి మహాతపంబొనర్చి, స్వప్రయోజనార్థమే గాక సకలలోకోపకారార్థము, తన యావచ్ఛక్తిని వినియోగపఱచిన మహామహిమాంచితుని భగీరథుని పితృభక్తి వర్ణింపఁ దరంబే? పితృపైతృకాదికర్మకాండంబు విసర్జించి జోగులై సంతతము కాలంబు వెళ్ళఁబుచ్చుచు దైవంబుఁ దిరస్కరించి తిరుగుదుష్టకష్టజనశ్రేణి యీభగీరథుని వృత్తాంతంబు సాంతంబుగ వీనులవిందుగ విని యుభయలోక విదూరులై చెడక తమ జన్మంబులు సార్థకంబులై వెలయున ట్లొనర్చు కొందురుగాత!

"మ. హరుమెప్పించి మహాతపోనియతుఁడై యాకాశగంగానది
ద్ధరకున్ దెచ్చి నితాంతకీర్తిలతికా స్తంభంబుగా నవ్యసు
స్థిరలీలన్ బితృకృత్యమంతయు నొనర్చెన్ వారితానేకదు
స్తరవంశవ్యథుఁ డాభగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే?"

# సుమతి.

తొల్లి సరస్వతీతటమున మకరధ్వజుం డను భూసురోత్తముండు కలఁడు. కలశాబ్ధివీచికి లక్ష్మివలె వానికి సుమతి యను బాలికామణి యొకతె జన్మించె. ఆపె శుక్లపక్షశశిరేఖ భంగి దినదిన ప్రవర్థమానయై తగు కాలంబునం దుచిత విద్యల నభ్యసించి పెంపెసలారు చుండె. ఆబాలిక తన తల్లిం జేరి "అమ్మా! పంకసంకలితయై వక్రగతి గలిగిన యలజాహ్నవి పరమపావని యనియుఁ బరమ పతివ్రత యనియునను చుందువే! యామె యేటి పతివ్రత" యనుచు గుట్టుమీఱఁగట్టి ప్రశ్నల నడుగు చుండెడిది. ఆమె చిన్నారిపొన్నారి పల్కుల కాతలిదండ్రు లానందభరితులై యాపె చిరంజీవినియై పేరొంద మనఁ జేయ నీశ్వరు ననారతము నారాధించు చుండిరి.

అంతం గొంతకాలమునకు సుమతికి వివాహంపుటీడు రాఁ గని తండ్రి యందందుఁగల ధరణీసురమాణవకుల గనుంగొని కేశికుని తనూజుండగు శశికరుఁడు గుణరూపంబుల నామెకుఁ దగిన వరుఁడని నిశ్చయించి యామె నిచ్చి శాస్త్రోక్తవిధానంబున నైదు దినములు ఝల్లుమనునటులఁ బెండిలి గావించెను.

ఆశశికరుఁడు దొల్త సుగుణంబుల పుంజమే యైనను గాలవశంబున వేశ్యాలోలుఁడై పితార్జిత విత్తంబెల్ల వమ్ము

చేసి యాయిందుముఖి, నాబింబాధరోష్ఠి, నాశుకవాణి, నాస ద్యః ప్రఫుల్ల పంకజపత్రనేత్ర, నాముకురసన్నిభకపోల, నాబంగరు బొమ్మవంటి సుందరి నేల నొల్లక యామెం జెడనాడి విడిచి, వేశ్యం డెడకుం బోయె. గుణవతియగు సుమతి పతియే దైవ మని యెంచి, "విధికృత మిట్లుండెఁ గాఁబోలు" నని తలంచి యింట వంటకము లన్నియు నొనరించి పతి యున్న తావునకుఁ గొనిపోయి ముం దునిచి భుజింపుఁడని ప్రార్థించిన నాతఁ డామె రాఁక కెంతయుఁ గోపించి

"ఉ. ఓసి యభాగ్యురాల! పడియుండక యింట నివేళ వచ్చినా
వే? సకలంబుఁబోయె నినుఁబెండిలియాడినపూఁటనుండియే
బ్రాసివి నీవు వేశ్యమునఁ బాదముఁబెట్టితి వంతకంతకుం
గాసాకమైన బట్టకొనఁ గట్టఁగ లేదిక లేచి పోగదే!"

అని రోషారుణిత నేత్రుఁడై పల్కిన సుమతి గడగడవణంకుచు విభున కిట్లనియె.

"ఉ. నాథుఁడె బంధుఁడు న్గురువు నాథుఁడె మాతృసహోదర
భ్రాతలు
నాథుఁడె దైవముం ధనము నాథుఁడె మోక్షపదంబు
నాథుఁడే
నాథుఁడె రక్షకుండు భువి సంయిల కలను గాన నామనో
నాథుఁడవీవు నీపదమునమ్మితిఁబ్రోవుము ప్రాణవల్లభా"

నాథా! భుక్తికి వేళ యతిక్రమించి యిప్పటికే రెండు

జాములు కావచ్చినది. ఓగిరం బిటకుఁ దెచ్చితి నారగింపుఁ డని” వేఁడుకొనిన నాతఁడు దప్పనిసరిగాఁ గొంత భుజించుచుండె. సుమతియుఁ బతిభుక్తశేషంబుఁ బళ్లెరంబున నిడికొని నిజసదనంబునకుఁ గొనిపోయి భక్షించుచు దినంబులు గడుపు చుండె.

శశికరుఁడు గణికాకాంక్షిత వస్త్రాభరణాదుల కైన ఋణబాధల కోర్వఁ జాలక యెరుల కెవ్వరకును దెలియకుండ నొక్క నిశీథంబున దేశాంతరగతుం డయ్యె. ఈవార్త సుమతి విని విభుఁ డేగిన మార్గమును దెలియకయే యిలు వెడలి యాతని పాదముద్రిల నచ్చటచ్చట నవలోకించి యా యడుగుల జాడలంబట్టి కొంతదూరముపోయి మార్గంబు దప్పి కంటకశిలావృతదుర్గమ మార్గంబులం బడి కడు కష్టంబులకుఁ బాల్పడి యెట్టకేలకు పద్మపురంబుఁ జేరె. అదృష్టవిశేషంబున నచ్చట నాథుఁడున్న తా వెఱింగి వాని చెంగటకుం బోయి నిలిచె. గర్భశత్రువు నవలోకించినంతన భగ్గున మండిపడు వాని భంగి నాతఁడు సుమతిని గని రోషారుణిత లోచనుండై “ఓసీ! దురాత్మురాలా! నీ వేల నాయెండ కరుదెంచితివి! నిన్నేల నని మున్న వచింప లేదా! నీకు సిగ్గేల లేదు! ఛీ! పో” మ్మని బహుపరుషవాక్యంబులం బలికి పరిహరించిన నాసతీ రత్న మాంత్మయం దించుకేని ఖేదంబు నొందక ప్రాణనాథునకుఁ బ్రణమిల్లి “నాథా! నా తలిదండ్రు లగ్నిసాక్షిగా నీకు

వివాహం బొనరించిరి. ఛాయ యేవేళను మనుజు ననుసరించి యుండురీతిఁ బతివ్రత యెప్పుడును పతి ననుసరించి యుండవ లయును గదా! మీయాజ్ఞానువర్తినై మీకేవేళ నేకార్యం బు వలసిన నావేళ నాకార్యం బాచరించుచు ముల్లంతయేని నావలన మీకు బాధ కలుగకుండ ప్రవర్తించెద. మీరు నన్నుఁ గోపింప నక్కఱ లేదు. భూసురోత్తములగృహాంగ ణప్రాంతోలూఖల తండులంబులం గొనితెచ్చి పచనంబు సేసి మీ కొసంగి తద్భుక్త శేషంబు భుజించి నిరంతరము యుష్మ త్పాదసేవఁ జేయుచుండెద. ఈమాత్ర మనుగ్రహింపఁ గదే” యని దైన్యము మీఱ వేఁడుకొని యెట్టకేలకు శశికరుని వశీ కరుని గావించుకొనియె.

ప్రత్యహ మాపరమ పతివ్రతాశిరోమణి విప్రని కేతనం బుల కేగి ప్రాప్తంబైన తండులాదులఁ దెచ్చి వంటకముఁ జేసి భయభక్తులతో ధవునకుఁ బెట్టి తద్భుక్తశేషం బుండిన యెడ భుజించుచు, లేనియెడ నుపవసించుచు నిరంతరము పతి నుపచరించుచుఁ బొద్దు పుచ్చుచుండె. ఇట్లుండ నూఁది మోప నెడము గన్పడ కుండునట్లు శశికరునకు శరీరమంతయు వ్రణములు బయలుదేరెను. సుమతి యెంత యో మది చుర పిల్లి పద్మపురంబునఁ దగువెజ్జులు లేమి, తత్సమీప గ్రామం బుల నున్న భిషగ్వరుల ప్రాపునఁ జెప్పరాని మందుల నెల్లఁ దెచ్చి యిచ్చి యౌషధసేవఁ జేయించుచుండె.

ఒకనాఁడు పద్మపురాధీశుఁడగు హరిసేనుని భటుఁడు శూద్రికరుం డనువాఁ డాతరుణేందు నిటల యగు సుమతిం గనుంగొని "భళిరే! నాయదృష్టము ఫలించుకాలము సమీపించు చున్నట్లు తోఁచెడిని, ఈతలోదరి నైన నోడంబఱచి మారాజునకిఁ గూర్చితినా యాతఁ డెంతయు సంతసించి నన్నొక గొప్పఁజేసి త్రివ్వి తల కెత్తుకున్నె? ఈసేవకావృత్తిఁ దొలఁగించి నాకేదే నున్నతపదవి నొసంగకున్నె? ఇంక నన్నెన్నఁడును గన్నులఁ గప్పుకొని మృత్యు మంత మాటయు నాచెవిని వేసి ప్రాణస్నేహంబున మెలఁగుట నిక్కంబని తలపోసి శశికరుని యవస్థలం దిలకించి యావిరిబోఁడిఁ జేరఁ బోయి కాంచి "ఓకాంతా! కత్తులబోనువంటి వీని యుపచార బాధలంబడి నలుగు చుంటివి. పూయ శరీరమును గల యీతఁడేమి నీకు బతి యేమి? ఒకపూఁట యైనను నిన్ను పోషించుటకు వీనికి గతి లేదు. నీవెంత సేవజేసినను మెప్పు లేదు. అకుమరుంగు పిందె వయి యంతిపురంబున నుండ వలసిన యింతివి! ఇట్టి వాని నేటికి చిత్తమున నిల్పి సత్తువ మీఱఁ బనులు సల్పెదవు! మారాజన్న నో! నవమన్మథుఁడు! నగధీరుఁడు! మహాబాత్పలనేత్రుఁడు! వానిం జేపట్టి సుఖింపు" మనిన విని సుమతి "హరిహరీ!" యని చెవులు మూసికొని రాజును శపించినఁ బాతివ్రత్యమహిమ నశించు నని తలంచి "మ. వినరా! శూద్రికరుండ! నీనృపున కీవృత్తి ప్రశస్తంబుగా

దని బోధింపర! దుష్టవర్తనులఁ దా దండింప నర్హుండువ
ర్తనయాచ్ఛార్జిత తండులాశనులమై ధాత్రీపతిం దండ్రి భా
వనతోఁ జూచితి కుంభినీపతులు దుర్వార్తల్ ప్రశంసిం
తురే?”

ఓరీ! నీవు సోదరుఁడవు! ఇట్టి యవాచ్యంబులం బల్కిన దైవము మెచ్చునే? పోపొ” మ్మని మందలించి పతిసన్నిధి కేగి తచ్చరణసేవఁ జేయుచుండె. శూద్రకరుఁడు రాజుకడ కేగి మొగమిచ్చకపు మాట లనేకములు సెప్పి యానారీమణిని స్వీకరింపు మని కోరిన నాతఁడు నాపతివ్రతాగుణాతిశయంబు కర్ణాకర్ణిగా మున్నె విన్నవాఁడగుటం జేసి తోకఁ ద్రొక్కిన త్రాఁచుపగిది మండిపడి “ఓరీ దురన్మతీ! ఆసాధ్విని కానిమాటలంటివి. ఆబిడ శపించిన హాని గల్గు. మన పూర్వపుణ్యంబుచే నామె క్షమించె. కాకున్న నామె కోపానలజ్వాలల కింధనములమై భస్మీభూతులము కావలదా! నీచా! నీ నోరెట్లాడెరా” యని వానిని గట్టిగా నొవ్వ నాడి బుద్ధిఁ జెప్పె. సన్మార్గవర్తనుండగు హరిసేనుఁడు “దుర్బలస్యబలం రాజా” యనున్యాయంబు మది నూని సుమతి తన విభుని పోషణకై పడు పలుపాటులంగని యాదంపతులకు వలయు రసవర్గము నెల్లఁ దనపురోహితుని మూలమునఁ బంపుచు వారియెడలఁ బరమభక్తియుక్తుఁడై యుండె.

శశికరుండు నిరామయుం డై కాలక్రమంబున నారో గ్యవర్ధమానగాత్రుఁ డగుచుండె.

అంత నొక్కనాఁడు హరిసేన మహారాజుత్సవంబు చేయించి వారవధూనృత్తగీత వాద్యంబులు చేయించు చున్న తఱిఁ బౌరులు, తదితర గ్రామవాసులు, తదుత్సవదర్శనకుతూ హలాయత్తచిత్తు లయి గుంపులు గుంపులుగా చనుచుండిరి. వారల శశికరుండు గని మన ముచ్చిళులూఱ నచటి కేగఁ దలఁచి తన సతీమణిని బిలిచి తన యభీష్టంబు వెలార్పఁ దోడన సుమతి తన మనోవల్లభుని మందమందగమనంబునఁ దనాట్య రంగంబునకుం గొని పోయి యొక యున్నతప్రదేశంబునఁ గూర్చుండఁ బెట్టి, తన ప్రాణేశుపై దృష్టి నిల్పి, తత్పృష్ఠ భాగంబున నిలువం బడియుండె. శశికరుఁడ త్యంతామోద భరితస్వాంతుఁ డై తనివితీర తౌర్యత్రికం బవలోకించి తద వసానంబున సతీసమేతుఁడై నిజకుటీరంబునకుఁ జనియె. నాఁటి రాత్రి నాల్గుజాలు మనోభవు బారికిఁ జిక్కి వెతలపాలై యున్నపతిని సుదతి సుమతి విలోకించి "నాథా! భవిచ్ఛిత్తం బభ్యవహార శయ్యాసనంబు లేమఱచియుండుట కేమికార ణం" బని యడిగిన శశికరుం డిట్లనియె. "ఓ పూవుఁబోఁడీ! దుర్ఘటం బైన కార్యంబునందు నామనంబు తగుల్కొని యున్నది. నీవు కోపగింప సని వాగ్దానం బొనర్తువేని తెల్పెద"

ఆసాధ్వీమణి బద్ధాంజలి యై నాథునకు మ్రొక్కి— "దేవా! యుష్మదాజ్ఞ శిరంబున నిడుకొని నాకు సాధ్యంబైనచో నద్దాని సమకూర్చెద" ననిన నతఁ డిట్లనియె. "నాగవాసంబునఁ బద్మాక్షి యను వఘూరత్నంబుపై నాచిత్తము లగ్నమై యున్నది." యన విని యాసతీతిలకము మందస్మితానన యై "స్వామీ! ఈమాత్రంబున కింత చింతింపవలయునే? నేను పతివ్రత నైతినేని భవన్మనోరథంబు దీర్ప సమర్థురాల నగుదు" నని నుడివి పద్మాక్షిపద్మంబునకుం జనియె.

ఉన్నతాసనాసీనయై యున్న పద్మాక్షి సుమతిని జూచినంతన తన గద్దియం డిగ్గనుఱికి యద్దానియం దామె నుపవిష్టురాలిఁ జేసి "ఓజవ్వనీ! నీ వెవ్వరిదానవు! ఇది వేశ్యాగృహంబు. నీ వుత్తమకుల ప్రసూతవుగాఁ గాన్పించుచున్నావు. ఇట రాఁ జెల్లునా?" యని పలుకు పద్మాక్షి నీక్షించి "కాంతా! నాపేరు సుమతి. నే శశికరుని ప్రాణేశ్వరిని నీతోడ నేస్తంబు సేయ నిట వచ్చితిని. నన్ను నీతోఁ బుట్టిన దానినిగాఁ జూచుకొ" మ్మని ప్రార్థించిన నామె యంగీకరించె. దినదిన మాపె పద్మాక్షి యింటికి వచ్చుచు రంగు మీఱ నిల్లంతయు రంగవల్లు లిడుచుఁ బాటలు పాడుచు నత్యంతమైత్రితో మెలఁగుచుండె.

ఆహా! స్నేహామువంటి పదార్థ మీ ప్రపంచమునందు

వేఱొండు లేదు కదా!

“సీ. అతిరహస్యంపుసంగతికిఁ దాళపుఁబెట్టె
మంచిచెడ్డలకుఁ జూపించు త్రోవ
కాలయాపనకుఁ జక్కనియుపాయం బమి
త్రిధ్వంసమునకు ఫిరంగిగుండు
ఘనకార్యములకుఁ బెట్టినపేరు దారిద్ర్య
భంజనమ్మునకుఁ దుపాకి దెబ్బ
యాపన్నివారణ కౌషధప్రాయమ్మ
తులలేని సుఖదుఃఖములకుఁ ద్రాసు
గీ. ఆత్మసంరక్షణమున కిమ్మైనకోట
సంశయమ్మునకు వినాశసమయ మరయ
సకల లోకోపకారంబు సలుపఁ గలుగు
మైత్రికన్నను వేఱొండు మహినిఁ గలదె!”

పద్మాక్షి పౌరులవలన సుమతి సద్వివేకంబు విని యెంతయు సంతసించి యంతకు మున్నె గాఢస్నేహంబున మెలఁగుచున్నది గాన యొకనాఁడామెను ప్రియమొప్పఁ జేరం జీరి “సోదరీ! నీవు మహాసాధ్వివి. అందును మహా రూపవతివి. నన్నాశ్రయింపవలసిన పని యేమి పుట్టె? నీవాంఛితంబేదియో కనిపట్టి తీర్చుట నాకు విధియై యున్నది. నాచేయు కార్య మానతి” మ్మనిన మాకరధ్వజి సంతసించి “పద్మాక్షీ! నాపతి చిత్తంబు నీయందు హత్తుకొనియున్నది”

యని చెప్పినఁ బద్మనేత్రి పక్కన నగి యంతలోఁ దెలివి నొంది "ఓసుమతీ! నీ వెంత మహిమాంచితురాలవో కదా! పతిచేష్టలఁ బరికించి యత్యంతామర్షంబున మండిపడి కోంపకుఁ జిచ్చు వెట్టక యిట్లు పరమహర్షంబునఁ బతి యిచ్ఛానువర్తినవై మెలఁగు నీబోటి కొత్తడిబోటు లెందునోగాని కానరారు. ఆహా! నాథుని మానసం బెక్కడ నొచ్చునో యని యెట్టిపని యైన నిర్వర్తింపఁ బూనెదవు. నీపాతివ్రత్య మత్యంత శ్లాఘాపాత్రము. నీవు దూషించిన దేవున కైనఁ గీడు వాటిల్లు. భూషించిన సమస్తలాభంబులుఁ జేకూరు. కావున నీమాట కెదురాడఁ జాల. ఇంతీ! ఈపుర మేలు హరిసేనుఁడు నన్నెంతయు గౌరవించుచుండు. రాజిది విన్న దండింపఁ గలఁడు. నీకోర్కెఁ దీర్ప కుందు నంటినా! అనృతదోషంబు వాటిల్లు. నీపతి నిచ్చటికిఁ దోడితె" మ్మని చెప్పిన సుమతి సంతసించి నిజనికేతనంబున కరిగి యావార్త భర్తకెఱింగించె.

పద్మబాంధవుఁ డపరదిక్పర్యంకమునఁ బరుండఁ బోవుచున్నట్లుండె. గగనయోషామతల్లి చెంగావిచీరఁ దాల్చెనో యన సంధ్యారాగ మెల్లెడ వ్యాపించె. పక్షులు శ్రేణులు గట్టి తమతమ నీడంబులఁ జేరఁబోవు చుండె. దిననాథుఁ డస్తమింప నతనికాంతారత్న మగు పద్మినిం గవయు నిదే తఱి యని యనురాగవేషుఁ డై నిశాపతి తన కరంబున నామె నంటిన వెంటనే "ఇదేమి? నామనోహరు కరంబు వెట, యాక

రంబు కరంబు చల్లన! ఇది శీతకరుమాయ కాదు గదా? యని ముఖంబు వంచె. చెంత నున్న కల్వకాంత తననాథున కైన పరాభవంబు గాంచి పక్కుననగె. అది గాంచినతోడనే తన గుట్టు బట్టబయ లయ్యెఁ గదా యని శశి కుందుచు వెల్వెలబాఱె.

ఆసమయంబున సుమతి యాత్మేశ్వరునకుఁ జేయూత నొసంగి పద్మాక్షి సదనంబునకు మందమందగమనంబునఁ జనుచున్నవేళ నకాల ఝంఝానిలంబు గాఢంబుగ వీవఁ దొడంగె. మకరధ్వజి ప్రాణేశ్వరునిఁ దనమ్రోఁపున నిడుకొని వాని పైఁ దన పయ్యెదచెంగు ముసుం గొసంగి చనుచుండె.

ఆపూర్వదినంబునఁ జోరులు హరిసేనుని మందిరంబునం గల ధనమపహరింపఁ జనుచు తత్పురప్రాంత నదీకూలంబున భవ్యతపోనిష్ఠుఁడును, విభాకరతేజుఁడు నగు మాండవ్యమునీంద్రుఁడు మాధవునిఁ జిత్తపద్మంబున నిల్పి ధ్యానించుచుండ వారా మౌనిపాదపంకేరుహముల కెఱఁగి తమ కార్యానుకూలంబునకై వానిం బ్రార్థించి వెడలిపోయిరి. వారు రాజగృహంబున కేగినతోడనే ధనము దొరకినందున నంతయు నా మునీంద్రు సందర్శన ఫలంబని తలంచి విశ్వాసయుతులగు నాచోరులు తమకుఁ బ్రాప్తంబు లైన స్వర్ణమయపాత్రాభరణంబులలోఁ గొన్నింటి నాముని సన్నిధి నిడి చనిరి. పిమ్మట రాజభటులు మ్రుచ్చు లేగినదారి నరయుచు వచ్చి మునిస

మీాపస్థస్వర్ణ పాత్రాదికంబులఁ గని వాని సహితంబుగ నాసం
యమిని రాజసభామధ్యంబునకుఁ దోడ్కొని పోయి తాము
గాంచినవిధం బెఱింగించిరి. హరిసేనుఁడు కాలవశంబుచే సాము
ష్టుండై వానిం బితృవనంబున శూలారోహణంబు సేయ విధిం
చిన వారలట్లొనర్చి చనిరి. కొంతతడవునకు మాండవ్యుఁడు
సమాధి చాలించి తన్నెవ్వఁ డవ్విధంబున నేమి కతంబున
బాధించెనో యని తన దివ్యదృష్టిఁ జూచి సర్వంబు నెఱింగి
ప్రారబ్ధం బనుభవింపక నేరికిం దీఱదని యూరకుండె.

నేఁడు సుమతి రఘుంఘూమహాయుత పరిసారంబునఁ గొన్ని
గానక దారితప్పి పితృవనమార్గంబున నేగుచున్నతఱిని నాఁబోటి
మూఁపుననున్న శశికరుని శిరంబు మాండవ్యుని పాదంబునకుఁ ద
గులుటంజేసి శూలాగ్రస్థమైయున్న యామౌని మేను కదలుటం
బట్టి శూలాబాధసహింపఁ జాలక “మచ్ఛరీరంబు చలింపఁ
జేసి నన్ను బాధించిన ధూర్తాచారుఁ డెల్లి మార్తాండమండలో
దయంబైన క్షణంబున మరణంబు నొందుఁ గాక” యని శపిం
చె. సుమతి యాశాపవచనంబు విని కలఁగఁబాఱి వితాకుఁ
జెంది కొండొకవడికి యామునిని సమీపించి “ఓయీ! నీ
వెవ్వఁడ వేమి కారణంబున నీరీతిఁ గొఱత నుంటి” వని యడి
గిన సంయమి యిట్లనియె. “ఓనారీమణీ! నేను మాండవ్యము
నిని. చోరులు హరిసేనుని మందిరంబున ధన మపహరించి స్వ
ర్ణమయపాత్రల నాముందునిచి పోయిరి. రాజభటు లంత

నా ముందున్న రాజధనమును గాంచి నేనే దొంగనని యెంచి నన్ను రాజుకడకుఁ గొనిపోయిరి. నృపుఁడు కోపహృదయుఁడై నన్నిచటఁ గొర్తవేసె." తొంటికర్మఫల మెవ్వరికైన ననుభవింపక తీఱదు గదా!

అప్పుడంతి యంతయు విని ముని నెంతయుఁ బ్రార్థించి పతికి శాపవిమోచనం బడిగిన నాతఁడు నోటికిఁ దాళము వేసికొనిన ట్లూరకుండె. దైవగతి కెంతయు నామె దురపిల్లుచుండె. శశికరుఁడును నామౌనిశాపాక్షరంబులు విని నిర్నిమిత్తంబుగఁ దనకట్టి శాపంబు ప్రాప్తంబగుటకు నెంతయు వంతం గూరి విన్నఁబోయిన ముఖమండలుండై స్మృతి దప్పి పడియుండె. అనంతర మాసుదతి "అయ్యో నాథా! ముని పెట్టిన గడువు గడువుగ నుండగనే యీయాపదువున నీవుంటి వేల? నిన్నెడఁబాసి నేనెట్లు బ్రతుకుదు" నని మోఁదికొనుచు విచారమగ్నయై యుండఁ గొండొకవడికి శశికరుండు తెప్పిఱిల్లి వగవం జొచ్చె. ఇట్టి విపదంబుధి దాఁటుట కేకాకినైన నాకు ధైర్యంబె యుడుపంబు. అది యెట్టిదే కదా!

"సీ. బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట
విపదంబు రాశిదుర్వ్యాకృతి కోడ
ఖలదురాలాపమార్గణ వజ్రకవచంబు
రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వ సంస్తభనౌషధి

మొనయుచింతా శ్రేణిమూఁకవిప్ప

యోగాదిసంసిద్ధు లౌనగూర్చు పెన్నిధి
తూలు నేకాకులతోడు నీడ

గీ. సకలసుగుణప్రధానంబు సకలకార్య
జాలసాఫల్య కరణైక సాధనంబు
ధైర్యగుణము ............. ..."

అనుచు నామె ధైర్యంబు చిక్కఁబట్టి "నాధా! కాను న్నది కాక మానదు. దీనికి వగచిన ఫల మేమి? అని వార్య మశోచ్య మ్మని విన లేదా! నేనే పతివ్రత నైతి నేని నీయసు వుల కిసుమంతయేని కొంచెంత రాకుండు" నని నిజనాధున కుత్సాహంబు నూల్కొల్పె. దుఃఖరోగార్తుఁ డైన పతికి సతి యే యౌషధ మనుమాట నిక్కంబే గద! పిమ్మట నామె తన మనోహరుని పద్మావతిగేహంబుఁజేర్చి యాతనివాంఛాపరి పూర్తి గావించి నిజసదనంబునకుం గొని పోయె. ఆసమయం బున నామె పాతివ్రత్యముదక్క రక్షణోపాయమువే ఱొండు లేదయ్యె. అంత నిజస్వాంతంబు పరమేశ్వరాయత్తంబు గావిం చి కొంతతడవు ప్రార్థించి

చ. పవలును జేయి మద్విభునిభవ్యపదాంబురుహద్వయంబునం
దవిలి భజింతునేనిఁ దలిదండ్రులు బంధులు దైవ మెల్లరుం
ధవుఁడెయటంచుస్వాంతమునసమ్మిభువింజరియింతునేనియా
రవి యుదయింపకుండెడి నిరర్థకమయ్యెడి మానిశాపముస్.

అని ప్రీతినఁ బూని పల్కినంతనె యాసాధ్వీతిలకంబు మాట జవదాఁటక భాస్కరుఁడు పొడసూపఁ డయ్యె. అందుచే లోకవ్యవహారంబు లన్నియుఁ గట్టువడియె.

"సీ. ఉదయాద్రి దినకరుం డుదయింపమిం జేసి
కాలవిభాగంబు నేలఁ గలసె
ఉదయాద్రి దినకరుం డుదయింపమిం జేసి
భూరుహాదులవృద్ధి పొల్లుపోయె
ఉదయాద్రి దినకరుం డుదయింపమిం జేసి
సకలాశగతియెల్ల సన్నగిల్లె
ఉదయాద్రి దినకరుం డుదయింపమిం జేసి
నిరతాగ్నిహోత్రముల్ నీటఁ గలిసె
గీ. సీతు వెల్లెడ వ్యాపించి చిక్కవఱచె
ఎండ సోఁకమి జీవులు పండఁ బాఱె
పాలిపోయి రహాహా! పాలబల్లి పగిది
లేనియది గాదె ఋతుప్రిండు లేని బ్రిదుకు."

వేల్పులం గూడి కమలభవుండు లోకంబు దుర్దశ నీక్షించి యఖండదయారసస్వరూపుం డగు నారాయణునిఁ జేరి పురుషసూక్తంబుఁ జదివి ప్రార్థించిన భక్తవత్సలుం డగు వైకుంఠుండు సాక్షాత్కరింపఁ "బరాత్పరా! సుమతీవిభున కలిగి మాండవ్యముని సూర్యోదయంబైన క్షణంబున నాతఁడు గతాసుఁడగు నని శపించె. భర్త మరణంబునకు వెఱచి యామె

తన పాతివ్రత్య మహాత్మ్యంబున నినుండుదయింప కుండునట్లు చేసె. దానం జేసి జగంబెల్లెడల గాఢాంధకార బంధురం బయి యున్నయది. ఈమహావిపత్పారావారమునుండి లోకం బుల నుద్ధరింపు" మని ప్రార్థించిరి. అంత నీశేజభవాదుల వెంట నిడుకొని వైకుంఠుండు సుమతి కడకేగి "ఓపతివ్రతాశి రోమణీ! నీ విట్లు ప్రతినం బూనిన లోకంబుల గతి యేమి? సర్వచేతనంబుల కచేతనత్వంబు సంభవింప సిద్ధముగనున్నది. కరుణించి సూర్యోదయం బగునట్లు ప్రసాదింపు" మని ప్రార్థిం ప నానారీశిరోరత్నము దోసి లొగ్గి యిట్లనియె, "దేవా! అస్మత్ప్రాణేశ్వర ప్రాణధారణంబు కంటె నా కీలోకంబునం దన్యం బెక్కుడు లేదు. నా ప్రాణేశ్వరుని తోడిద లోకంబు లోకైకరక్షకుండ వగు నీవే దీనికిం దగువెర వూహింపుము."

అంతం బరమేశ్వరుం డెంతయు సంతసించి "ఓసాధ్వీ! యుష్మద్భర్తృజీవం బొసంగితిని. నీనాథుండు వజ్రకాయుండై తొంటివలెం గాక నీయందు బద్ధానురాగుండై ప్రవర్తించు. మమ్మును లోకమున్ననుగ్రహింపు" మని వేడుకొనెను. సుమతి సూర్యు నుద్దేశించి.

చ. వెలుంగుల ఱేడ! రేవెలుంగు వెల్గులం దూలుచువాండ! వేయిచే
తులుగలప్రోడ! తమ్మియనుతొయ్యలి నేలినవాండ! ఛాయయు
గ్మలికివిరాళిం గొల్పునలగాముల ఱేండ! యివంబు సూడ! యు
త్తాలు దెసం దోంచినీవిపుడుతోరపు వేడుకం గూర్పుమాయింగన్

అని ప్రార్థించినఁ బూర్వదెసఁ బాటలకాంతి దోఁచె. చల్లని గాడ్పులు వీచె. కమలములువిరియఁబాఱె. సురభూసుర సంఘములెల్ల జగచ్చక్షువునకు మ్రొక్కి రంత.

మ. సుమతీనాథుఁడుదీర్ఘనిద్రనెనసెన్ సూర్యోదయోద్యత్ప్రభా
సముదాయేక్షణుఁడైనపిమ్మటర మేశబ్రహ్మేశశూలాద్యులా
సమయంబందుశతాబ్దముల్ బ్రదుకుమైశ్వర్యంబులం జెందియో
సుమతీవల్లభ యంచు సేసలిడిరౌత్సుక్యంబుతో నందఱున్.”

తద్దేవతావరప్రసాదంబున శశికరుండు దృఢకాయుఁడై దీర్ఘాయుష్మంతుఁడై యింపెసలారె.

అజ్జారే! పాతివ్రత్యమున సీత నవఘళించి, సావిత్రితోఁ దులఁదూఁగి, యరుంధతితో ననఁగి పెనఁగి దమయంతితో వియ్య మంది, పార్వతితోఁ బంతగించి, యనసూయతో సరస మాడి, సరస్వతి తలఁ దన్ని, లక్ష్మి నిర్లక్ష్యము సేసి, శుచిత్వమున నగ్ని కెనయై, పుట్టినయింటికిని మెట్టిన యింటికిని యనుపమానకీర్తి నాపాదించిన మహాపతివ్రత సుమతీచరిత్రము హిందూసుందరీమణుల కెల్లర కాదర్శమై చెలంగుఁగాత!

— ♦ —

# ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రమ్.

కనకారవిందసందోహవిచలన్మదభృంగయు, బ్రహ్మహత్యాదిమహాపాతకవిభంగయు, ఘనతరగయవిచలద్రింగత్తరంగయు, విపులసైకతభాగవిలసిత చక్రాంగగణసంగాంచితరంగయు, హరజటాజూటాగ్రరంగయు, పరమగంభీరనీరాంతరవిహారాసక్తమత్తమాతంగయు, దివ్యప్రభాపుంజప్రదీప్తాంగయు నగు దివిజగంగకు జనకుండై వెలసిన జహ్నుమహామునికులమున గాధియను భూకాంతుం డుదయించె. సహజ సౌందర్య లావణ్య విలాసవతియు, శరదిందువదనయుఁ బంకజదళాయత లోచనయు, మదరోలంబకదంబకబరీభరయునగు గుణవతి సత్యవతి వాని కుదయించె. భృగుకుల వరేణ్యుండును, బుణ్యజన గణ్యుండును, సతత పరమ తపోనిష్ఠాగరిష్ఠుండు నగు ఋచీకుం డను మునిసత్తముండు సత్యవతినిం దనకుఁ గూర్మిసతిగానిమ్మని గాధిరాజు నర్థించిన నసితదేహములై శ్వేతకర్ణ మొక్కండు గల వేయి తురంగంబులు తన కూఁతునకు నుంకువగా నిచ్చినఁ బిల్ల నిచ్చెద నని గాధిరాజు నుడివిన నట్టి ఘోటకంబు లీయ నాతఁ డొడంబడి "రాజా! నీవలసినప్పుడట్టి హయావళి పరిభవించు" నని చెప్పి యమ్మునిసత్తముండు సురసరిత్తీరంబున కరిగె.

గాధిరాజు ఋచీకుని మాటలు సత్యంబులౌనో కా

యని మనంబునఁ దలంచి తా నొంటుచో నిలఁబడి యేకసిత కర్ణాసిత సైంధవానీకం బిప్పట్టున నొప్పఁగఁ బుట్ట వలె నని తలఁచినంతనఁ నయ్యావి బుడమిని సొడమి నిలిచె. దానంజేసి కన్యాకుబ్జంబున కనతిదూరంబున నున్న ప్రదేశం బశ్వతీర్థం బను పేరఁ బరఁగు చున్నయది.

అంత మునికుమారుని తపఃప్రభావంబునకును, మహిత వాక్సిద్ధికి నచ్చెరువడి తచ్ఛాపభయభీతాత్ముండై మేదినీధవుఁడు పాదచారియై దేవతరంగిణికిం జని ప్రార్థనాపూర్వకంబుగ వానిం దనపురంబునకుఁ దోడ్కొని వచ్చి తన యనుంగుసుత నిచ్చి యచ్చరలెల్ల మెచ్చున ట్లతివైభవంబున నుద్వాహం బొనర్చె. చంద్రచంద్రికాన్యాయంబుసరణి నడిచి, మణిసూత్రన్యాయంబుమాడ్కిఁ బ్రవర్తించి, క్షీరనీరన్యాయంబున నెగడి, తరంగన్యాయంబునఁ దనరి, ప్రసవామోదన్యాయంబునఁ బరిఢవిల్లి, విషమవిషయారణ్యసరణిగల సంసారంబునఁ బది నలినీపత్రజలబిందున్యాయంబున మెలంగుచు, నైహికసుఖంబులు మీసాలపైఁ దేనియ లని తలంచి, వక్రశీలంబునకు దూరులగుచు, నశేషగృహస్థధర్మవిశేషంబులకుఁ బుట్టి నిండ్లై, యెల్లవారలఁ గన్నవారి తెఱంగునఁ గన్నులఁ గప్పికొనుచు, వీసం బైన దోసంబులపొంతఁ బోక, కాలము వ్యర్థపుచ్చక నిరంతర పరమేశ్వరపాదారవిందమరందపానాసక్తమదబంభరములై యాముని దంపతులు ఋజుమార్గవర్తులై యుండిరి.

విధాతకృత్యంబుల వైచిత్ర్య మేమందుము! సుందర కళాబృందంబునఁ జెన్నొందుచందమామకుఁ గందునొసంగెఁ సకలసంగీతసాహిత్య సంపన్నునకు రూపంబు రూపఱఁ జేయు. ధనకుబేరునకు వదాన్యత కల్లఁ జేయు. సంపన్నుని కోమలి గొడ్రాలుగ నొనర్చు. అట్లె సుగుణవతి యగు సత్యవతి సౌఖ్య సంతానంబులు కల దయ్యు సంతానంబు బోలు సంతానంబు లేమికిఁ దద్దయు విచారించి యాముద్దియ యొద్దిక మీఱ భర్తయొద్దకుఁ జని యిట్లనె. "నాథా! సంసార నరకవాసుల మైన మనల నుద్ధరించు పుత్త్రుఁ డెన్నఁ డుదయించు. పుత్త్రులు లేకున్న గతులు లేవందురు కదా!

"సీ. కులవర్ధనుం డగు కొడుకుఁ గానని యట్టి
లాఘవాస్పదుని యాలయము లయము,
సిరులకుఁ దోడవైన వరసుతుఁ బడయని
ఘన కలుషాత్ము జీవనము వనము
పితరుల ఋణము దీర్చెడు సూనుఁ జెందని
దౌర్భాగ్యశీలు గోత్రమ్ము త్రము
రహి నిహపర సుఖప్రదుఁ బుత్త్రు నెత్తని
వరపుణ్యహీను భవమ్ము వమ్ము
గీ. పలుపలుకు లేల నిఖిలము ఖిలము సూవె
యాత్మజులు లేనివారి కో యతివరమణి
తరమె యనపత్యువైవర్ణ్య మరయ నతని

యఖిలమును నిట్లు ముఖవర్ణహానిఁ జెంద.

జననీ జనకుల కానందసంధాయకులును, గులదీపకులు, నగు కుమారులు లేమి వ్యర్థురాల నైతి. మహాతపస్సంపన్నుల రగు మీరు కటాక్షించిన నద్దాని గొంత గల్గునే, యని దీనానన యై వేఁడుకొను ప్రియురాలిం గాంచి ప్రియుం బారఁ జేరఁ దీసి, నీకుఁ బుత్రోత్పత్తి గావింపఁ జాలు చరువు సంపా దించెద, నని యోదార్చి యామె కిచ్చవచ్చిన వేళ నొండు వరంబు కోరుకొ మ్మనిన నాకొమ్మ, యమ్మునితో నిట్లను. "నాథా! మాయమ్మ పుత్రసంతతిలేని దుఃఖభాజనమైయున్నది. ఆమెకును బుత్త్రోత్పత్తి సాధనం బెఱిఁగింపు, డని వేఁడు కొ నెను.

అప్పరమ తపోధనుఁడు నిజతపశ్శక్తిని రెండు చరువుల నిర్మించె. అందొకండత్యుజ్జ్వలమగు బ్రాహ్మణత్వము. వేఱొకఁ డధికతీవ్రం బగు రాజభావంబు. ఆరెండును సత్యవతికిఁ జూపి తత్ప్రభావంబులు వేఱువేఱ నుపన్యసించి భర్తతో నాచరువు లుపయోగించునపు డశ్వత్థ బును నౌదుంబరంబును నాలింగ నంబు సేసి క్షాత్రం బైన చరువు మీయంబ కిచ్చి బ్రాహ్మ ణంబైన దాని నీవు గైకొమ్మని వచించె. ఆహా! విధికృత మని వార్యంబు గదా!

" కం. చరువులు నమ్మని చెప్పిన

తరువులు పేడ్వాడియె సుత కుఁదల్లికి నట్ల

యిరువురు నుపయోగింపఁగఁ
గరుపులు తత్తత్ప్రకార కలితము లయ్యెన్."

ఇట్లుండఁ గొంతకాలంబున కాతల్లిబిడ్డలిరువురును గర్భవతు లైరి. నెన్నడుములు పేటికం బేది పెంపుగాంచె. నునుపైన చెక్కులు తెలుపాఱఁ జొచ్చె. కెంపులసొంపు హసించు మోవి వెలవెలబాఱఁ దొడంగె. తలఁపునఁ గోరిక లుప్పతిల్ల గర్భభారంబున నడు గామడమై దోఁచ నెలలు నిండ వింత సోయగంబు తనయింతి మొగంబునఁ గాంచి, దివ్యబోధమహనీయుండు గావున—

"ఆ. వె. చ్యవననందనుండు సత్యవతీగర్భ
భంగిసూచి యకట! బ్రాహ్మణుండు
గాఁడు తరుణి! నీదు కడుపులోపలి బిడ్డ
క్రూరుఁడైన రాచకొడుకు గాని.

అని పల్కి చరుతరువ్యత్యాసంబున నట్లగుటఁ దేటపడం జెప్పిన నబ్బోటి యత్యంతవిషాదవేదనాదూయమాన మానసయై "ప్రాణేశ్వరా! నీ కొమరుండు బ్రాహ్మణధర్మవిరహితుండైన లోకంబు మెచ్చునే? నింద లన్నిట లోకనింద దుర్భరము. నీతపోగౌరవమున నీవ్యత్యాసము మాన్పు" మని నమ్రయై ప్రార్థించినపడఁతినవలోకించి "సఖి! వీఁడు బ్రాహ్మణుండే యగుఁ గాని వీని కొమరునకు రాజతేజసంపద యతిశయిల్లు" నని వర మిచ్చె.

అంతఁ గొన్నిదినంబుల కక్కాంత ప్రసవవేదన నొంది యఖండదివ్యతేజోనిధి యగు జమదగ్నినిఁ గనియె. గాధిభార్యకు విశ్వామిత్రుఁ డగు విశ్వామిత్రుఁడుజనిమంచె. అఖండవైభవంబున విశ్వామిత్రుఁ డనేక సహస్రవర్షంబులు రాజ్య మేలి యొక్కనాఁడు చతురంగాక్షౌహిణీ బలసమేతుఁడై మృగయాలోలుఁడై, పరిథవంబున నగరంబుల దాఁటి, రాష్ట్రంబుల నతిక్రమించి వనాశ్రమంబులఁ గ్రుమ్మరుచు, నొక ఋష్యాశ్రమమును సమీపించెను. తదాశ్రమసమీపసరోవరంబు నందొక్క తీరమునందొక్క తావున వ్యాఘ్రాజంబులును, నొక్కచోట గజకేసరులు నొక్కవంక మూషక మార్జాలంబులు నొకదెసఁ గేకికాకోదరంబులు నొక్కచో నీరుద్రావుచుఁ బ్రియం బార సంచారంబులు సేయుచుండ విశ్వామిత్రుఁడు గని సత్వగుణప్రధానపుంజీభూతమై మునిమహిమాంచితమై తనరుచున్న యాశ్రమంబుఁ జొచ్చి వసిష్ఠునకుఁ బ్రణమిల్లిన నాతఁ డాశీర్వదించి యుచితాసనమునం దునిచి యర్ఘ్యపూజలు గావించి యిట్లు ప్రశ్నింపఁ జొచ్చె. రాజపుంగవా! దుష్టరిపువ్రాతంబు నిర్జించి, రాజ్యాంగములఁ బాటించి, భూభాగంబు చక్కగఁ బరిపాలించు చుంటివి కదా! నీవు నేఁడు మృగయా వ్యాపారంబున బడలినట్లు పొడగట్టెడిని. అల్లదే! నిర్మలమైన తీయనీటఁ బ్రవహించు సెలయేఱు. దానఁ దానమాడి రండు. మీ కెల్లరకు విందు చేసెద” నని చెప్పిన విని

వానికి విశ్వామిత్రుఁ డిట్లనియె. "మునీంద్రా! నాకు, నక్షౌహిణీ సేనకును విందు చేసెద నంట యుచితంబు గాదు. అచిర కాలంబున నే బురంబు చేరఁ గలము. వనమున కేతెంచియీ బోంట్ల దర్శనము లేకపోవుటనుచితం బనితలఁచి వచ్చితి. భవద్దర్శనలాభంబు లభించె. మీయట్టి సాధుతాపసులకు బాధ కలుగఁ జేయ నామన మొప్పకున్నది. ఇఁక సెల వొసంగుము. పోయి వత్తుము"

"విశ్వామిత్రా! నాయింటి కేతెంచి యాతిథ్యంబు గైకొనక పోవుట పాడిగాదు. మీరాక వలనఁ బరమసంతోష మయ్యె. ఎన్ని యక్షౌహిణుల కైన విందు వలయు కాలంబునఁ బెట్టఁ గలవాఁడ మజ్జనమాడి రండ"ని వసిష్ఠుఁడు పలికె.

వసిష్ఠునకుఁ బ్రతివచనంబు చెప్పలేక గాధినందనుం డక్షౌహిణీ సేనామేతుఁ డై నదికేగి స్నానమాడి వచ్చుసరికి సురభి ప్రభావంబున వసిష్ఠుఁడు షడ్రసోపేతంబు లైన ఖాద్య, చోష్య, లేహ్యాదివివిధవస్తువులు, మృష్టాన్నరాసులు, నాజ్యప్రవాహంబులు, మధురదధికుల్యలును, వివిధ సూపశాకంబులును, సృజించె. ఎల్లవార యుల్లంబునఁ బెల్లుగ సంతసించి కుతూకబంటిగా భుజించిరి. విశ్వామిత్రుఁ డపరిమితాశ్చర్యానందభరితుఁ డై తత్కారణమంతయు నరసి వసిష్ఠు డాసి "ముని కులతిలకా! లక్షహయంబులను, లక్షభద్రేభంబులను, లక్షమణులను, లక్షగోవుల నిచ్చెద నీక్షణ మాకామగవి నిమ్మ"ని

యడిగిన వసిష్ఠుఁడు నగచి "రాజా? ఈధేనువే నాజీవితము ఈసురభియే నాసర్వస్వము. ఈజేజేలగిడ్డియే నా పెన్నిధి. నీరాజ్యమంతయు నిచ్చిన నీవేల్పుటావు నీఁ జాల, నని పలికిన రాజు కుపితుఁడై యామొదవును బలిమిం గొంపోవ నాసురభి కోపించి తనుఁ బట్టిన యుద్దండభటతాండంబులఁ బడఁ దన్నియు, పొడిచియు విడిపించుకొని వాయువేగంబునఁ బఱతెంచి వసిష్ఠుని మ్రోల నిలిచి" నరనాథుని భృత్యులు బాహుదర్పోన్నతి నన్నుఁ గట్టుకొని పోవ నూరక చూచెదవు. స్వామీ! నీయెడ నేనెట్టి యెగ్గొనరించిన దానను గాను. నన్నొప్పరికింపఁ బాడియే?" యని విలపించుచుండ "ఓసీ! క్షత్రియ వీరుఁడగు నీక్షోణీశుఁ డక్షీణవిక్రమోజ్జ్వలుఁడు. వీనిం గెలువ సరసిజాసను కైన శక్యంబు గా" దని నుడివె.

"స్వామీ! నీవు ఘనతేజుఁడవు. నిర్జరులకైన దుర్జయుఁడవు. మఱియు

"కం. తలపోయ నెందు క్షత్రియ
బలమునకంటెఁ గడువిప్రబల మెక్కుడు నీ
వలిగిన నతఁ డెంతటివాఁ
డలవున నను బనుపు మతని యఖిలబలంబున్"

పరిమార్చెద నని పలికిన కామగవికి "నీ నవాంగోత్థబల కింకరుల సృజించి వేవేగ వైరిబలంబుల నుగ్గుసేయు" మనిన వసిష్ఠుని వాక్యము ప్రమాణంబుగాఁ గొని గోవు ఘనహుంకా

రంబు సేసె. ఆహుంకారంబున శాతాయుధబాణులు యవను లుత్పన్నులై కౌశికుని బలంబులం గవిసి సర్వంబును బరిమార్చిరి.

కోఱ లూడబెఱికిన పాముపగిది, రాహుగ్రస్తుఁ డగు నినునివమువున, ఱెక్కలు తెగఁగొట్టిన పక్షిచ్ఛందంబునఁ, బొటాఱిన పాథోధికైవడి నుక్కు దక్కి క్షాత్రంబుకన్న బ్రాహ్మ్యం బెక్కు డని గ్రహించి గాధినందనుఁడు సుతునిఁ బట్టాభిషిక్తునిఁ జేసి వెడలి తుహినశైలపార్శ్వంబున హరునిఁగూర్చి భూరితప మొనర్చె. అంత శివుఁడు బ్రత్యక్షమై వర మడుగుమని నుడివిన విశ్వామిత్రుఁడు సిఖిలధనుర్వేదము సాంగోపాంగము నుపదేశ మిమ్మని వేఁడి దివ్యాస్త్రయుతంబుగా నది వడసి దర్పాతిరేకంబునఁ బూర్వవైరాగ్నిజ్వాల లాకసము ముట్ట వసిష్ఠు నాశ్రమముఁ జేరంబోయి సర్వప్రాణి భీతావహంబుగా వసిష్ఠుపై నాగ్నేయబాణ పరంపరను బఱగించె. వసిష్ఠుఁడు దండధరోద్దండకాలదండమును విపక్షక్షత్రశిక్షాదండము నగు బ్రహ్మదండమును నేలం బాతె.

"ఉ. తక్కక యోరికౌశిక మదంబున వచ్చి చిరప్రవృద్ధమై
యెక్కినసజ్జనాశ్రమము నేల వినాశముచేసె దింక సాం
పెక్కక నాశ మొందఁ గల వీమరితంబున నీవు, నీబలం
బెక్కడ! నాదుబ్రహ్మబలమెక్కడ! క్షత్రియవంశపాంసనా!

అని మాఱు సాగెను.

ఆభీలవిశాలకీల లలరఁ గౌశికుఁ డతి క్రూరాగ్ని బాణం

బు వేయ, వారి యగ్నిజవంబు వారించువడువున బ్రహ్మదండ
మాశరపరంపరను వారించె. విశ్వామిత్రుఁ డలిగి యనేకా
స్త్రంబులఁ బ్రయోగించి యవి యన్నియు నిష్ప్రయోజనంబు
లగుడు మహాస్త్రంబగు బ్రహ్మాస్త్రం బరివోసి వేసిన సకల
సురగరుడోరగ గంధర్వులును సకలగ్రహతారకసకలభువనంబు
లును చలించె. అంత నాబ్రహ్మాస్త్రంబు మంటలఁ గ్రక్కు-
చు, బ్రహ్మర్షిని సమీపింప నతఁడు బ్రహ్మదండమున మహా
స్త్రంబు నుపసంహరించె. బ్రహ్మర్షి బ్రహ్మతేజస్ఫురణంబు
మెఱయఁ బాణాగ్నికీలం గాధిపుత్రుని జుఱుపుచ్చం జొచ్చె.
మునులందఱు భయకంపితులై "వసిష్ఠా! నీ తేజంబు నుపసం
హరింపుము! విశ్వామిత్రుఁడు నిరస్తప్రభావుఁ డయ్యె." నని
పలుక వసిష్ఠుఁడు ప్రశాంతచిత్తుం డయ్యె. అంతట విశ్వామి
త్రుఁడు గర్వోపహతుం డై లజ్జితుండై "ఛీ! క్షాత్రబలంబు
బ్రహ్మబలంబు నెదుట దివిటీకడ దీపమువంటిది. బ్రహ్మబలం
బనివారిత, మభయప్రద, మజయ్య, మధికం, బనుపమానం,
బప్రతిహతంబు, బ్రహ్మర్షిత్వంబు గడింపని జన్మమేటి" కని
తలపోసి దక్షిణాశాతటంబున కరిగి వేయేఁడులు తపం బొన
రించె. పితామహుఁ డట కేతెంచి గాధినందను తపంబునకు
మెచ్చి "విశ్వామిత్రా! నీవింక రాజర్షివిగమ్మ! పొమ్మ"నిన
"ఔరా! తలకొట్లమారీ! నాతప మూరక చెఱచితివి. బ్రహ్మ
ర్షిత్వంబు నాకుఁ గూడువఱకుఁ దపంబు చేసెద. నీ రాజర్షి

త్వమే నొల్ల నని చెప్పి విశ్వామిత్రుఁడు మరల ఘోరతపం బు సేయ మొదలిడె.

బ్రహ్మయు సురులును మెచ్చి వచ్చి "విశ్వామిత్రా! నీవు ఋషి వైతివి. తపము చాలింపు" మని వాని హెచ్చరించి వారును జన నంతతో నాతండు తృప్తి నొందక మరలఁ దప మొనర్పఁ దొడఁగె. అచ్చరలు వేఱుగతి గానక, హరినీలోపలవేణియు, శరదుదంచచ్చంద్రికాహాసభాసురాననయు నగు మేనక నంప నా చంపకగంధి వచ్చి వాని మోహాంధకారంబునఁ గూలఁ ద్రోచె. గాధినందనుఁ డామె తోడఁ బదియబ్దంబులు నెల్ల సుఖంబులనుభవించి పిదప నదంతయు నజునిమాయగా గ్రహించి మరల సంసారమునందు విముఖుం డయి తపస్సునందు సుముఖుం డయ్యె. అక్లాతఁడుత్తరగిరి తటంబున వేయేండ్లుగ్రతపం బొనరించె. మరల దేవతలను వెంట నిడుకొని యజుఁ డేతెంచి మహర్షి వైతివనఁగాఁ దపోవిఘ్నంబునకుఁ జింతించి బ్రహ్మర్షి వన్నంతదాఁకఁ దపం బొనర్తు నని గాధేయుఁ డత్యుద్ధతిఁ దపం బొనరింప మొద లిడి యనిలాహారుఁడు నూర్ధ్వబాహుఁడు, నిరాహారుండు నై, వేసవినిఁ బంచాగ్ని మధ్యమునను వర్షాగమంబునఁ దోయములందును, వేయివత్సరంబు లుగ్రతపం బొనరింప జంభారి రంభను రావించి దేవహిత కార్యంబుగా గాధినందను తపంబు విఘ్నంబు సేయఁ బొమ్మని యాన

తిచ్చిన నయ్యచ్చర హెచ్చుగా భయమంది "యముని తె అవునకడ్డుపో వెలుతు" ననిన నాతఁడామెను హెచ్చరించిపనిచె.

కుంతలంబు లలినీలాలకప్రభ లెల్లెడ వెదచల్లఁ జలు నవ్వువెన్నెల లాననసీమనటింప, గండుకోయిలకూఁతలు తోడు గా మదమరాళయానంబున రంభ వచ్చి విశ్వామిత్రుని దపంబు గలంచె. ఆయంతరాయమున కాతఁడు రోషారుణీత లోచనుఁడై పదివేల వర్షంబులు పాషాణత్వము నొందున ట్లామెను శపించి మరల వేయేఁడులు నిశ్చలస్వాంతుఁడై తప మాచరించె.

సురపతి వాని గురుతర తపమునకు వెఱఁగంది బ్రాహ్మణరూపంబున విశ్వామిత్రునిసమీపించి వత్సరసహస్రానం తరము పారణ సేయుచున్నతటి నన్నము సర్వము తా గ్రహించి వాని పారణకు భంగ మొనర్చి చనియె. గాధినందనుఁడు దండతాడితభుజంగంబుకైవడి మండిపడి, జలనిధులు కలఁగ నుడుపథమునసుండి యుల్కలు రాల, మబ్బు లేకయే పిడుగులు పుడమిఁ బడ, నుడుపతిగ్రహపతులబింబంబు లసియాడ సురలు గడగడ వడఁక, వేయిహోయనంబులు తపం బొనర్చె. ముని వరులు, గంధర్వులు, సురలును, బరమేష్ఠికడ కేగి మొఱ్ఱలిడి, బ్రహ్మర్షిత్వము నైన, బ్రహ్మపదము నైన వాని కిప్పు డీకున్నఁ దత్తపోగ్నిజ్వాలలకు బ్రహ్మాండంబు భస్మంబౌ నని సంయమిసిద్ధరాదులు వేఁడగా బ్రహ్మ,

"మ. చననే తెంచి, భవత్తపోమహిమ విశ్వామిత్రబ్రహ్మర్షివై
తనిశంబుండపమింక నేల యనబ్రహ్మంజూచి బ్రహ్మాత్మజుం
డునుబ్రహ్మర్షియునైన పుణ్యుఁడువసిష్ఠుండిచ్చునిక్కంబుగా
ననుబ్రహ్మర్షిపదంబు వైతి నకనేనమ్మన్ జగద్రక్షకా!"

అని పల్క బ్రహ్మయు సర్వదేవతలును వసిష్ఠునిబూజించి నిష్ఠాగరిష్ఠుఁడ వగు నో వసిష్ఠా! ఈ విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యని నీవు పల్కనఁగాని తపము మాన కున్నవాఁడు. తత్తపోగ్నిజ్వాలఁ జల్లార్పఁ గదే" యని ప్రార్థించిన నాతఁ డరుదెంచి "విశ్వామిత్రా! తపోమహత్త్వమున బ్రహ్మర్షి వైతి" వని పలికినంతఁ దపంబు చాలించి విశ్వామిత్రుఁడు వసిష్ఠు నెయ్యంబొప్పఁ బూజించె.

చ్యవనమునీంద్రుని వరప్రసాదంబున జమదగ్ని రేణుక యం దొకకొమరునిం గనె. ఆతఁడే సకలక్షత్రియవంశాటవీదహనకోపానలజ్వాలాభీలుం డగు పరశురాముండు. ఒకనాఁడు మాహిష్మతీ పురాధినాథుఁడును, నిజప్రతాపవినిర్జితసహస్రకరుండగు నా కార్తవీర్యార్జునుండు చంద్రగుప్తుండను మంత్రిపుంగవసమేతుం డై యక్షౌహిణీసేనాపరివృతుండై వేఁటతమకంబున నరణ్యాం బంతయుఁ దిమ్మరి జమదగ్ని యాశ్రమంబు సమీపించి యాతనిచే సేనాసమేతంబుగ సత్కృతుం డై, తిన్న యింటివాసంబుల లెక్కిడుచందంబున వానియింట నాహ్వాయంబుగఁ దిని వానికడ నున్న కామగవిని గోరి యాతఁడు నిరాకరిం

చినందున నారాజు తనయు లాముని తలఁదఱిగి వెడలిపోయిరి. పాపము! పుట్టుకను బ్రాహ్మణుఁడయ్యు, సంపూర్ణక్షాత్రతేజో విరాజితుండగు పరశురాముం డింట లేఁడాయె. పంచత్వమొం దినప్రాణనాథు నెదుట నుంచుకొని పతివియోగంబును భరింప లేక, రేణుక దిక్కు లేని దానివలె విలపించుచుఁ దన ఱొమ్ము శ్రమపై నిరువదియొక్కమాఱు మోఁదుకొనెను. ఫలసమిత్కుశకుసుమార్థ మరణ్యమున కేఁగినరాముఁడు మరలి వచ్చినంతన కన్నీరు మున్నీరుగా విలపించుతల్లి నవలోకించి కారణం బరసి పాడువడినవనంబు చూచి

ఉ. ఎవ్వఁడు చొచ్చె నీవనము నెవ్వఁడుచారుమహీజరాజముల్
  గ్రొవ్వననేలఁ గూల్చెజనకుం విమలాత్ముఁదయావిహీనుఁడై
  యెవ్వఁడు చంపె నిట్లు జననీ! వచియింపుము నేఁడె వానినిన్
  జివ్వను దున్మువై చెదను చెచ్చెరఘోరశిలీముఖంబులన్.

మఱియుఁ దల్లీ! యుల్లంబునఁ బెల్లు వగచి యెల్లరచిత్తంబులు గరఁగ నిరువదొక్కమాఱు హృదయంబున మోఁదుకొంటి విది సంజ్ఞగ నే నిరువదియొక్కమారు క్షత్రియమహాతకుల వధించి తద్రక్తధారాప్రవాహంబున మాతండ్రికిఁ దర్పణం బొనరింతు. ఇదియే నాప్రతిన. ముమ్మాటికి నమ్ము” మని సమయం బొనరించి పరాక్రమంబున మించి మించువలె నదృశ్యుఁ డయ్యె.

రాముఁడు సత్యలోకంబున కేఁగి సురాసురయక్షగరుడ గంధర్వసేవితపాదపంకరుహుండగు లోకేశుఁ గొనియాడి తదాజ్ఞానుసారుఁ డై శివలోకంబున కరిగి జగదుద్భవస్థితిలయ కారణుం డగు ఖండపరశువుం గొండాడి సకలచరాచరరూపజ గదంబ యగునంబ కంజలి ఘటించి పరవిమర్దనదక్షమగు తన ఖండపరశువును గ్రహించి, యాపన్నమునిగణపరిపన్న తాలం కరిష్ణు రోచిష్ణుండగు విష్ణునకుఁ గైవార మొనర్చి, వరము లనే కంబులు వడసి, సూర్యపరిభాభాసమానుఁడై రెండుమీసంబు లపై రెండుచేతుల నుంచి "ఇదంబ్రాహ్మ్యమిదంక్షాత్రి" మ్మని ఘొల్లరకుఁ జాటుచు, బ్రతిన నిలబెట్టుకొనఁ దలంచి గర్వి తాంగులగు భూనాథులపైఁ దాఁడి వెడలెను.

పట్టినపట్టు వీడని యాపరశురాముఁడు బ్రాహ్మణుం డయ్యు, క్షత్రధర్మధౌరేయుం డై మత్స్యభూపాలుని మడి యించి, సారబలుని జక్కాడి, మాగధుని బరిమార్చి, సోమ దత్తునిఁ జాగఁబలాడి, నిషాదపతి నుఱుముచేసి, బృహద్బలుని బిలుకుమార్చి, సుచంద్రుని గీటడించి, కార్తవీర్యార్జుని సంవ ర్తపురంబున కంపి యిరువదియొక్కమాఱు శేష క్షత్రియులో కంబును దెగటార్చి తదుధిరధారాపరివాహనివహంబున నైదు చెఱువులు నిర్మించి పితృతర్పణం బొనర్చె. తత్తటాకనిర్మి తం బైనస్థలం బిప్పటికిని శ్యమంతపంచకం బనుపేరఁ బరగు చున్నది.

# తానొకటితలఁచిన దైవమొకటి తలఁచును.

కట్టా! ఎట్టియవమానంబు సంభవించినది! దైవయోగ మలంఘ్యంబు గదా! లోకములోఁ బగఁ దీర్చుకొనుటకంటెఁ గడు ప్రమోదకరం బగున దేదియు లేదు. ఆడదాన నే నేడ? ప్రబలపరాక్రమాభిరాము లని పేరొందిన నా శత్రుల తోడి పగఁ దీర్చుకొను టేడ? స్త్రీకి నేర్పడ భర్త. అట్టి భర్త కా నోచనైతి. తలితండ్రు లందునా! వారలతోడ ఋణంబు చిన్ననాఁటనే తీఱె. ఇఁకఁ దోడ్పడు వారెవ్వరు? అటు లన నేల? తోడఁబుట్టిన తోడువంటిదికలదా! అట్టికోడు గంపంత యుండ నేఁ బలువగలఁ గుంద నేల? అనుచు నలనాఁడు విశాలవక్షస్థలులును, నిర్వక్రవిక్రమార్కులు నగు మువ్వురు సోదరుల కెగఁబోసి బలసమేతులుగఁ గొని పోవ వా రతి ఘోరంబుగఁ బోరు సల్పిరి.గాని నాయభాగ్యతచే. సేనాసమేతు లై యారిపులవాఁడి తూపులకుఁ బ్రాలై మడిసిరి. నే నందుల కెంతయు దురపిల్లి ముల్లోకవీరుం డగు నాయగ్రజుని పాలికేగి యెల్లభంగుల నాభంగపాటెఱింగించి యీపరాభవాంబుధి నుండి న న్నుద్ధరింపు మని వేఁడ నతం డెన్నరాని పన్నగం బులం బన్ని యొకరీతిగ నాపగతురకు శృంగభంగం బొనరించె. అది యంతటితో నాగక కొఱవిం గలగోక్కికొని నట్లయ్యె.

చూపులకుఁ జిన్నలయ్యును బరాక్రమంబున మిన్నలగు నా యరివీరులు ప్రబలబలసమేతులై నాసోదరుని నట్టింటం బ్రవే శించి యతిభయంకరంబుగ సంగరంబు సల్పుచుండిరి. మా యన్న యన్ననో సామాన్యుండు గాఁడు. ప్రతాపవినిర్జిత మధ్యందినమార్తాండుఁడు. మేరుభూధరసంకాశ ధైర్య స్థైర్య విరాజితుండు. బహుబలపరాక్రమోపార్జనుండు. ఆతఁ డెఱిఁ గిన మాయ లెవ్వరు నెఱుంగరు. కాలుక్రింద నైనను గన్నము త్రవ్వఁ గలవాఁడు. అవులించునఁ బేవులు లెక్కిడువాఁడు. ఆహా! ఆతఁ డొనర్చిన మహాకార్యంబులు ప్రశంసింప నెవ్వాని కేని దరం బగునా? పిన్ననాఁటనే ద్వంద్వంబుల కెల్ల నోర్చి నిష్ఠమై ఘోరతపం బొనరించి యెవ్వరు నేనాఁడుఁ బడయని వరములఁ బడసిన మహాశూరుఁడు. సాపత్న్య సోదరుని భయపె ట్టి రెండవ ప్రభాకరునిచందంబున దేదీప్యమానంబుగ వెలుంగు నతని నివాసం బగు పట్టణంబును లాగుకొని యఖండవిభవం బున రాజ్యమేలిన రాజపుంగవుఁడు. అసాధ్యుల సాధ్యులుగా నొనర్చిన జోదు. సిద్ధులను బద్ధులుగా నొనర్చిన శూరుఁడు. యక్షులను బక్షులుగాఁ బాఱఁదోలిన బంటు. భోగుల విభో గులుగాఁ జేసిన పోటరి. యోగితతి వియోగతతిగా నొనర్చిన మేటి. మాయాయుద్ధంబున మా సవతియన్నను వంచించి వి మానంబు సంపాదించిన ఘనుఁడు. చండదోర్దండంబుననుద్దండ త వెండికొండ నొకచెండువలె నాడించి త్రిభువనైకవీరుఁడని

ఖ్యాతి వహించిన మహామహుండు. అమరావతిపై దండెత్తి దేవేంద్రాదులఁ జిదుక మొత్తినప్రోడ. తొలినాఁటి యుద్ధంబున వానరులెల్లరు వెఱఁ గందఁ దనశక్తి నెల్లఁ జూపిన నాసోదరుఁడు రెండవనాఁటి సంగ్రామంబున మహాబలశాలి యని పేరొందిన లక్ష్మణకుమారుని మూర్ఛఁబుచ్చిన నా సోదరుఁడు కట్టా! ఏమని చెప్పుదును. నేఁడు రామ నిశితశరవిద్ధుండై కాందిశీకుఁ డయ్యె. మాయాతపస్వియగు కాలనేమి చేష్టలన్నియు సుడిసి పోయె. మేఘాంతర్గతుండై కపటపు బవరం బొనర్చు నింద్రజిత్తుమాయ యంతయు మాటుమాయమయ్యె. నేనెంత నిర్భాగ్యురాలను. తొలుత ఖరదూషణత్రిశిరులను మువ్వురు సోదరులను కడుపునఁ బెట్టుకొంటి. నేఁ డింకేమి వాటిల్లనున్నదో కదా! అన్నకావేశము గల్గించినది నేను! సీతయందు వ్యామోహము జనింపఁ జేసినది నేను! అది యిది యన నేల? లంకారాజ్యసర్వస్వమున్ దిగ మ్రింగుటకుఁ బుట్టిన బ్రహ్మరాక్షసిని నేను! దైవమా! ప్రసన్నుఁడవు కమ్ము! కాలమా! మమ్ము వంచింపకుము! రాజ్యమా! మము విడనాడకుము! భోగమా! దూరీభూతులను చేయకుము! వారికంటెనే నెక్కుడుమాయాకార్యసంఘటనాచతురతగలదాననా? కాకున్న నొక్కొక్కతఱి మట్టియుంతయు సిద్ధౌషధంబువలెఁ బనిచేయునుగదా! ధీవరుఁడు వల వేసి పాఠీనజాలంబులం బట్టుభంగి నామాయాజాలంబు విప్పి రాముని నాకర్షింపఁ జూచె

ద. ఆతఁడు సీతను విడనాడి యనేక వాసరంబులుగా వచ్చినది. వియోగదుఃఖాంబుధి మునింగియున్న రాముఁడు చంద్రునిఁ గాంచి చకోర మానందించునట్లు సీతావదనమండలం బవలోకించి నంత నపారముదంబు నొందు ననుట నిక్కంబు. కామ రూపి నగునే నాతని వంచింపఁ జాలనా! అనువగు సీతిన్ననిబాటంజని యారాముని మోసపుచ్చెద” నని శూర్పణఖ తనలోఁ దానట్లు తలపోయఁ జొచ్చె.

రావణుఁడు రాముని తీవ్రవిశిఖంబుల కోర్వఁ జాలక రణరంగంబునుండి పారిపోయి యొక్కచోఁ గూర్చుండి యిటు లాలోచింపఁ దొడఁగె. “సీతను గొని వచ్చి చాలకాలంబయ్యె. సామదానోపాయంబుల వలనను నాబెదిరింపు వాక్యములవలనను, నాశక్తికొలంది యత్నించి యెన్నివిధంబుల బోధించినను నాసీత నన్ను దృణీకరించి తనభర్తయే లోకంబు గా నాతని స్మరించు చుండు. ముఖాముఖిని నే వాక్రుచ్చుట యటుండఁ బరోక్షమున మాయాన్విత లగు నారక్కసి నెలంతల నెందఱిమూలముననో నాగాథల బోధింపఁ జేసితి. కాని యామె వీసమంతైన నాదెస కొరిగినట్లు కాన్పింపదయ్యె. నేఁడు రామునితోఁ బోరతిఘోరం బగుట నే సీతని గెలుతు నన్న మాట నీటిమూట. నేఁడో రేపో నాయసువులు వాని యసిపుత్రిక కర్పింప వలసి యున్నది. ఆహా! సీతను దెచ్చుటకై పడినపాటు లన్నియు వ్యర్థంబు లయ్యెఁ గదా! అటు సీతనా

పరిపాలించుకొన లేనైతి. రామునితో దిట్టనై యిటఁబోరలేకు
టి. ఇట్టియయోమయావస్థను గూడ కడఁగొట్టువెలి వొకటి
పొడఁగట్టుచున్నది. అది నెగ్గు నని కరంబు నామనంబు మురి
యుచుండె. ఆరామమున నున్న యారామను జెట్టఁబట్టుట
కెన్ని వేసంబుల నైన వేసితింగాని శ్రీరామవేషధరుండనై యె
న్నఁడును యత్నింప నైతి. నే నిప్పుడు తద్రూపంబున నామె
చెంత కేగెద నాయింతియు రాముఁడిచ్చటనే యున్నవాఁడగు
టంబట్టి తప్పక మోసపోయి నా యభీష్టంబు చెల్లించు. దీన
సంశయంబు లేదు." అని యనుకొనుచుండ యుద్ధగంగంబునఁ
గలకలంబు విని యటనుండి తరలిపోయె.

ఒకనాఁడు రాముఁడు, "నానిశిత బాణప్రహారణములం బడి
యారావణుండు నిలువ లేక రణంబు వీడి యేకడకో పోయి కా
న రాఁడయ్యె. అయ్యధముఁ డగు నిశాచరాధిపుఁ డెపుడు కా
న్పించు నెప్పుడు వాని రూపుమాపువాఁడ! అటుగాక సీతం
గై కొను టెట్లు?" అని తబ్బిబ్బు వడి యెట్టకేలకు, రావణవధకుం
బూర్వమే సీతం గాంచి వియోగంబుచే కృశించిన యామె కు
త్సాహంబు గల్పించి వచ్చెద" నని కృతనిశ్చయుఁడై యుండె.

అంత మాయావినియగు శూర్పణఖ యశోకవనంబు
బ్రవేశించి పోవుచుండ రఘుకులాంబుధిసోముని, హిమధామ
ప్రహ్లాదకరుని, దానవభుజంగమయూరుని, బహుపావనావతా
రపుంగవుని దవుదవ్వులం గాంచి తటాలున నొక యశోక వృ

క్షుంబున శైవాలావృతకుశేశయముభంగి, మాసినవలువచే నావృతమై, వడఁదాఁకినవల్లికచందంబున మేను వాడి, కెంగేలు చెక్కునఁ గీలించి, కనుఁగొనలనుండి బాష్పకణంబులు జాలువాఱ, జడలుగట్టిన శిరోజంబులతో, నుపవాసంబులచే బ్రుంగినయొడలితో, వేడినిట్టూర్పులతో "రామా! త్రిలోకాభిరామా? నాజీవిత మంతయు నీయశోకవృక్షచ్ఛాయలయందే గడిచి పోవుచున్నది. నాశరీరసుఖంబులు పొల్లువోయె. శతయోజనవిస్తీర్ణంబగు నీసంద్రముఁ గట్టఁ గలవా? యను సంకోచం బంతరించె. కేసరుల కిరవైన గుహాకరణి నసురుల కిరవైనలంకఁ బ్రవేశింపఁ గలవా యను సందియంబా పాసిపోయె. కాని నిన్న మొన్నటి యాలంబునందాలోకవిద్రావణుం డగు రావణునిదాడి కొక్కొక్కతఱి మనవీరులు వెనుకంజ వేసిరని వినికిడి యయ్యె. ఆనీచుని వధించి నన్నెప్పుడు చేట్టవట్టెదు! విమలదుకూలభూషణధారణాద్యైశ్వర్యంబు లెప్పుడనుభవింతు! మృగమదాదిసౌరభవిభవం బెన్నఁడామోదింతు! మృదుశయ్యాసనభోగంబు లెప్పు డొడఁగూడు! ధవళాతపత్రంబులచే విరాజిల్లు నీయర్ధాసనంబునం దెప్పుడుపవిష్టురాల నగుదు! కన్నులు కాయలు కాచి పోయినవే! నీమనోహరరూపంబు గాంచు భాగ్య మీజన్మంబున లభించునా!" యని యర్ధనిమీలితనయనయై విలపించుచుండె.

రాముఁడు, వాడి, వంది, కుందినయాకుహనాసీత నిజ

సీతయేయని తలంచి యెంతయు మదిఁ జింతించి యామెను స మీపించి "ప్రేయసీ! ఏల విలపించెదవు? నీనాథుఁడు నీయుం డ నున్నవాఁడు. ఆననతామరసం బెత్తి చూడుము. నిన్నెం తయు దురంతచింతాంబుధిఁ గూలఁద్రోసిన ద్రోహి నని తలం పక, నీమాటయే మఱచి హాయిగా సకలసౌఖ్యంబు లనుభవిం చుచు వినోదంబులఁ బ్రొద్దు బుచ్చు దురాత్మకుఁడ నని యెంచ క, యీరామునిపైఁ గరుణాకటాక్షములఁ బ్రసరింపఁ జేయుము నీవింక వంత మాను" మని యామెను సమీపించుచుండ సీత తటాలున లేచి నిలువఁబడి రామునియందు తనకు తొల్లి దండ కాటవి నంకురించిన ప్రేమబీజం బిప్పుడు ఫలోన్ముఖం బగునం చు మనంబునం దుప్పొంగుచు నామె వేసిన పాచిక పాఱిన దని తాను నిజముగా సీతయే యని రామునకు దృఢవిశ్వాస మంకు రింప రామరూపంబున నున్న రావణుఁ డనుభ్రాంతి నొందినవి ధంబున, "ఓయీ! ఇటెన్ని తడవు లీపడంతిని భంగపుచ్చఁజూ చెదవు. నాఁడు కపటసన్న్యాసివై నాపర్ణశాల కేతెంచి, నన్న ర్థించి నిజరూపంబున వంచించిన క్రూరుఁడవు! నేఁడు రాముని రూపంబున వచ్చి మరల వంచింప నెంచితివా! దురాత్మా! నీమాయలు, నీమాటలు, నీయాట లిట సాగిరావు. పొ"మ్మ ని యదలించె.

రాముఁడు సంతసించి "ప్రేయసీ! మాయారూపంబున నున్న రావణుండను గాను. నీప్రియుఁడగు రాముఁడను. వా

చియుండిన మదీయచక్షూరాజీవయుగంబునకు నీదర్శనసూ ర్యోదయంబున సంతసించు నన్నుఁ జిన్నిచూపునఁ జూడ న్యా యంబు గాదు. సీతా! నీకై కదా! వానరులతో మైత్రిగావి నర్చి, యవ్వారల నెన్నరాని కష్టంబులఁ బాల్పఱచి, సము ద్రమునకు సేతువు గట్టి, కట్టిడియిసుములఁ గుడిచినది. అనే క వానరుల బవరంబునఁ గోల్పోవుచున్నది నీకై కదా! అట్టి నన్నిప్పుడు దూఱిన నే నెట్లు మనఁ గల్గుదు" నని వాపోవ దొడంగె.

విశ్వాసంబు కల్గించితి నని లోన సంతసించుచు సీత "వానరులతోడి నేస్తంబును, సముద్రతరణాదులును, సర్వదనుజ విదితవిషయంబులే! ఇంతపాటి వృత్తాంతంబు లెల్ల నాకు దృఢ విశ్వాసంబు గలుగఁజేయు" నని విముఖతతోఁ బలికె.

రాముఁ డంత "కాంతా! పంపాసరోవరతీరంబున నీతో డినాపడినవిరహవేదనాభరమాపరమేశున కెఱుక! భూమిజా! చిత్రకూటాశ్రమోపాంతవనాంతరతం బగు శిలాతలంబునందు మన మిరువుర ముపవిష్టులమై యున్నతఱి దురాత్ముండగు కాకాసురువధింప సమకట్టినరాముఁడీతఁడే! తొల్లి హనుమంతుఁడు నీయానవాలుగా నాకొసంగినసువర్ణపద్మరాగశిరోరత్న మి యదియే! దీననైన నన్ను నమ్మవా!" యని యొక ముద్రికం జూపి యామెకు నమ్మిక గలుగఁజేసె.

మాయారూపధారిణియగు సీత తన మనంబునఁ "దొ

ల్లి సారఁబుంపు కాకాసురాదివృత్తాంతంబుల మాయమున్నకు నివే
దించునపుడు నే విన్నదియు నీయమాయకుఁడగు రాముఁడు వ
చించునదియు నొక్కటయ్యె. సెబాస్! ఇఁక నామాయాజా
లంబున సీతఁడు పట్టువడియె" నని యుప్పొంగుచు మందహాసం
బు కనుగొలంకులఁ దొల్కాడ రాముని సమీపంబునకుఁ జేరి
పాణిపల్లవంబున వాని హస్తంబును బట్టి "నాథా! నేఁడు కదా!
నాకోర్కె లీడేఱె! నాజన్మంబు తరించె! నానోములు ఫలిం
చె! రామా! ఈదీనురాలికై నీవెట్టి ప్రయాసలం బడితివి! క
ట్టా! ఈవ్యర్థురాలు నీఋణ మెట్లు తీర్చుకొనఁ గల్గు. ఐన
దాని కింక వగచినఁ బ్రయోజన మేమి? ఇప్పు డింకిచటఁ ద
డయ నేల? సత్వర మీసీమ వీడి పోవుద" మని పల్కె—

"మనోహారిణీ! మనము వచ్చిన కార్యమేమి? వానరు
లందఱు మనకై కదా? చుట్టపక్కాలను వదలి చిన్నారిపొన్నారి
వయసులోఁ జెట్టుచేమయనక రాయి ఱప్పయనక పులి పుట్ర
యనక, ఈడు జోడు విడిచి, వేళపాళలేక కాయగసరులు వేరు
వెల్లంకులు దినుచు నిప్పట్టణంబున రాక్షసవీరులతోఁ బోరుస
ల్పుచుండిరి. అట్టివారి విడిచి పోవుట పాడియా? మఱియు దు
రాత్ముండగు రావణునిఁ బుత్రమిత్రకళత్రాదులతోఁ జీల్చి
చెండాడక లంక నిశ్శంక వీడి యిపుడు పోఁగలమా!" యని గం
భీర నిర్ఘోషంబునఁ బలికె.

మాయాసీత యెట్లో సోదరుని రక్షణమునకై యాపె

యీాప్సితార్థంబునకై వేగ పలలపుముద్ద దన్నుకొని పోవుమా
డ్కి రాముని దన్నుకొనిపోవ నెంచినది గాన నప్పలుకులకు
మనంబునఁ జింతించి "నాథా! అయ్యో! కుందనముపంటి మీా
మేనెట్లు మదీయవియోగమధ్యందినాతపమునఁ గందియున్న
దో చూడుఁడు. ఇంకను నీయడియాస లేల? కుసుమకోమ
లంబగు నీతనువు నాదుష్టరాత్రించర నిశితశరపరంపర బాధింప
నేల? "దుష్టం దూరం వర్జయే" త్తను నట్లానీచుని తోనాపర
మ దురాత్మగ్గునితో మన కేల" యని యెంతయు బోధింపఁ
దొడంగె.

"ప్రియసీ! లంకకు సేతువు గట్టి లంకఁ బ్రవేశించి కొ
న్నిదినంబు లని సేసి రావణుని దునుమాడ కూరకపోదునా?
రావణుని యుగ్రబాణంబుల కెంతయు వెఱచి దొంగచాటుగా
రాముఁడు సీతను గొనిపోయె. ఆతఁడు నొకపరాక్రమవంతుఁ
డేనా? యను లోకనింద భరింపశక్యమే? ఈనీబోధ నేనొల్ల"
నని రాముఁడు పలికె.

కపటసీత మనము నందలి చింతపై కగపడనీక "నాథా
లోకంబున దూఱనివార్యంబే నైనను నీరావణుని సామాన్యవి
రోధి యని యెన్నరాదు. వానిం జంపిన బ్రహ్మహత్యాదో
షం బావహిల్లు. అది యుక్తమే కదా!

సీ. కమలగర్భునిఁగూర్చి ఘనతపం బొనరించి
వరములఁ గైకొన్న పరమపాపి

సలినాగమంపుఘనా, జటల్ విడఁదీసి,
భేదముల్ చూపిన విద్వరుండు
నగచాపులింగముల్ నవకోటి యేప్రొద్దుఁ
బాయకపూజించు భక్తిపరుఁడు
అతుల తపోధనుండగు పులస్త్యబ్రహ్మ
కానంద మొడఁగూర్చు నాత్మజుండు
గీ. మనుమఁ డలసృష్టికర్తకు మానధనుఁడు
దండిమగఁ డౌర! షట్ఛాస్త్ర పండితుండు
అట్టివానిని వధియింపఁ జుట్టుకొనదె
బ్రహ్మహత్యామహాపాప బాడబంబు?

ఇట్లను మాయాసీత నవలోకించి యామె సద్వర్తనాపరత్వమునకును, బ్రహ్మహత్యాదిపాపవిముఖత్వమునకును గడు నలరి "ప్రియసీ! ఆవేదవిదుని శివపూజాధురంధరుని వధించుట మహాపాతక హేతువే నైనను దుష్టశిక్షణము, శిష్టరక్షణయు నాయవతారములకు ఫలంబులు గదా! అదియుం గాక యాగజనేయుఁడు దొల్తనీకడకు వచ్చి నిన్ను తన వీఁపున నిడుకొని కడువడి శ్రీరాముం గూర్చెద నని పల్కినతటి యుచిత టిగాదు. రావణుండు దొంగచాటున నన్నుఁగొని తెచ్చినట్లు రాముఁడును సీతం గొనిపోయె నందురు. అట్లుగాక యాఖలు నాలుబిడ్డలతో నిర్మూలంబు గావించి విజయలక్ష్మిఁ జేపట్టి వెల్గొందిననాఁడే రాముఁడు నన్నుఁ గైకొను గాత మని యంటి

వఁట. అట్టి యుదారబుద్ధి నేఁడటుల మటుమాయ మగుటకుఁ గారణం బేమి? నీవు నిజమగు సీతవో కావో యని సందియంబు వొడమెడిని." అనినంతన సీత భీతయై "రామా! అసురు ద్రొక్కనేల? కాలు గడుగనేల? అట్టివానిం జంప నేల? ప్రాయశ్చిత్తంబునఁ బాపంబుల రాచు టేల? అంతపాటి శ్రమం బాటు నీ కేల యని యంటిం గాని మనశత్రువు నెడ మిత్రభావంబుచేఁ గా" దన రాముఁడాసీత భూజాత నిశ్చయంబని యెంచి "ప్రియా! నీయభీష్టం బటులుండిన నారాతిఁ ద్రుంచరవీరునిఁ ద్రికరణంబుగ విడిచి పుచ్చెద నీయిచ్చవచ్చిన తెఱంగున మెలంగెద" ననియె.

అనంతర మాసీత యింతతీవ్రంబుగ దాడివెడలివచ్చిన యాశ్రీరాముఁ డాపరాక్రమంపుఖని పాపభీతిఁ దననిశ్చితార్థంబు విడనాడి యిటు స్త్రీసులభుం డయ్యెడునా యని కొండొక మనంబున విచారించుచుండ రాముఁడు కలఁగిన చిత్తంబుతోఁ దత్తరంబున "కలికీ! నాహృదయంబునకు ములికి యగుచందంబున నెద్దియో యోచించు చున్నట్లు తోఁచుచున్నది. ఇంతలో నీమనంబింత సందియంబునకుఁ దావలంబు గానేల?" యన సీత "రామా! పరాక్రమాభిరామా! ప్రజ్ఞానిధివి, నిపుణమతివి గదా నీవు! ప్రారబ్ధార్థము నుజ్జగించి యిటుల స్త్రీలోలుని పగిది వచించెద వేల? ఇది పరాక్రమమునకు సహయంబు గాని యతిచపలచిత్తులగు సతివలపలలం జిక్కు సమయ

బు గాదే?" యనినంతనే "ఓసి బేలా! నీవేల యీలీల నూహిం చెదవు, పర్ణశాలనుండి నీవెడలిన జాడ దెలియక కొన్ని దినంబులును, తెలిసియు నీవుండుతావు దుర్లభం బగుటం జేరలేక కొన్నిదినంబులును, జేరియు నిన్ను కన్నులారగాంచు సమయం బబ్బక కొన్నిదినంబులును, వ్యర్థంబులై చనె. తడవులనుండి నీవియోగాగ్నిచే దందహ్యమానుండ నగు నాకు హఠాత్సంభవంబైన నీసందర్శనామృతధారాసందోహంబు వలన నుపశాంతి నొందినవాఁడనై యిటుల నీకు వశంవదుఁడనైతి. అంతియ గాని వేఱొండుగాదు" అన కరంబు సంతసించి "శ్రీరామా! నన్ను క్షమింపుము! ఇదె నీదాననైతి! నైకొమ్ము. పోదమురమ్ము. ఐనను, వినుటంబట్టి చూడఁ గుతూహలాయత్తనై యిత్తఱి నిన్నొక్కటి వేఁడెద. నీవు రణరంగంబున రావణునిఁ గాందిశీకునిఁ గావించిన నిన్నటి యుగ్రరూపంబు నొకసారి చూపి నన్ను ధన్యురాలిం జేయుమనిన వెంబడిని "యాగూపంబు జూపినం గాని నన్ననుసరింపవా?" యని రాముఁ డన నాపె ముక్కున వ్రేలిడుకొని "ఎంతమాట! చెప్పునది యొకటియుఁ జేయునది యొకటియునా! ఎంత వాకుృత్తు నంతయు జరిపెద" నని యాపె ప్రతిన వట్టె.

అంత నట్టినిరుపమాన రూపంబు దాల్ప వేల్పువిరోధికి వీలు గామిం జేసి "సీత పతివ్రత! మాట తిరుగనేరదు. నే నెట్టి యుగ్రరూపంబు జూపిన నాకు వశవర్తినియై మెలఁగ గల

ద” ను గాఢవిశ్వాసంబునఁ దన మాయ బయల్పడ వింశతిభు
జంబులు మెఱయఁ బదితలలు ప్రిభలీననిరువది నేత్రంబులనుండి
యొక్క మాఱు ప్రేమపూరితదృగ్జాలంబులు సీతపైఁ బర్వ

మ. కలికీ! శాంతమెభూషయైతనరునాత్మాకాంతకున్ బుత్రివై
జలజాతప్రభవాండభాండమున శశ్వత్కీర్తి కర్పూరమున్
గలయం జల్లినమేటి యోజనకు పెన్గారాబపుం బిడ్డవై
తొలుతన్ నీవు వచించినట్టి సమయోక్తుల్ నిల్పుమో జానకీ!

అని యన్నమాట కెదురాడ వలదని హెచ్చరించు మాయారూపుఁడగు రావణునిఁ గాంచి లజ్జించి వంచినతల వంచినటులే యుంచి యేమని వాక్రుచ్చుటకు నోరాడక తన్నుఁ గట్టఁ దాళ్ళు తాఁ దెచ్చుకొనినటు లగుటకుఁ జింతించి జిగురు కండెల నంటుకొనిన పక్కివడువున, నుచ్చులం దగుల్కొనిన కురంగి తెఱంగునఁ దప్పించుకొను దారి గానక మనసు కళవళపడ “నన్యథాచింతితం కార్యం దైవమన్యత్ర చింతయే” త్తనురీతి యయ్యెగదా! యని వగచి వగచి తన రూపంబు జూపి వాని కాశాభంగంబు కల్గింపఁ దఱి గాదని యోచించి “ఓరీ దురాత్మా! మాయారూపముతో వచ్చి నన్ను వంచింప నెంచిన రావణుండ వని నే నాదియందే గ్రహించి యుంటిఁగాని నా నాథురూపంబున నుంట మోసపోయితి. నీ మాయా వచనంబుల నమ్మి భంగపడితి. ఔరా! చిత్రకూటవృత్తాంతంబు నుడివి, శిరోరత్న ప్రశంస విస్తరించి యెట్లు వంచించితివి! దు

రాత్మా! ఇది నీకుఁ దగ" దని యనేకవిధముల చెంచనాడఁ దొడఁగె.

రావణుఁ డాపె పరుషవాక్యంబుల వినియు విననివాని వలె "సీతా!

చ. పలికినమాట కాదనకు పల్మెఱు నన్ దెగనాడఁబోకు మో
జలరుహపత్రనేత్రి? విను సత్యవిహీనుని మాయఁజాల నం
చలభవదీయమాతవిబుధాధిపతుల్ వినఁబల్కెఁ దొల్లి య
య్యలకుఁ గుమారివయ్యు నిటులింతటి దబ్బఱలాడఁజెల్లునే?

సీతా! త్రిజగన్మోహనసౌందర్యోపేతా! ఇట్టిమాయా రూప మేల నంటివో? కపటప్రవర్తనం బెందుల కనియెదో? నీచేత నింతగ వాగ్దానము చేయించినది యేలకో యనియెదో? వినుము

మ. నను బూర్వంబు శపించెరంభ పరకాంతన్ బల్మిమైఁబట్టఁబో
యిన మచ్ఛీర్షము వేయివ్రక్కలగునంచేనిన్నునిందాఁకము
ట్టన యీ హేతువుచేత నిష్ఠా తగ వెంటన్ వత్తునం చీవ ప
ల్కినదానన్ నినుఁగోరి వచ్చితిని గల్కీ!యింక నెందేగెదో

"అటులనా! రంభచే శాపంబు నొందిన యోదురాత్మ! తీయనఁ జెల్లుదువే? ఎంత వచించితివి, నీమాయ తెలియ లేక టు పల్కితిని. అయ్యది. భ్రమాకృష్టమైన ప్రతిజ్ఞ. ఇంక నన్యాయంబున కొడిగట్టెదవా! వనితాలోక రక్షణారంభమగు రంభశాపంబు నీకు ఘటిల్లుట నిక్కంబు. ఎటుగ చెడి యిటుఁ

బ్రివర్తింపక నీదారిం జనుము.

మాయాసీత వానిబారినుండి తప్పించుకొనం దలంచెం గాని యయ్యది యసాధ్యమగుటను నింక నిజరూపంబున బయ ల్పడినం గాని వెర వొండు లేదని యెఱింగి నిజరూపంబు ధరిం చి "సోదరా! ఈరూపమున రాముని మోసపుచ్చి యతని యుద్ధరంగమునుండి తొలంగించి, నిను రక్షించుట కెంతయుం బ్రియత్నించితి. కాని కాలవశంబున విపరీతమయ్యె.

ఉ. రామధరాతలేశునిశరంబుల కోడి భయంబునన్ సమి
ద్భూమిని వీడి పాఱి తని పోరిచుటకై నిను నిట్లు మాయచే
భూమిజవేషమూని పలుపోకలం బోయితివంచకుం డెటన్
సేమమునొందునే యొరులచేం గడువంచనం బొందకుండునే?

అని తన రూపంబు చూపుసరి కాపంక్తిముఖుండత్యా శ్చర్యచకితుండై చిన్నవోయి తానొర్చిన వృథాప్రసంగంబున కెంతయుం జింతించి "నానుదుటనే పొడ్డుపొడిచె నని విజ్ఞపీం గు నాకుం దగిన ప్రాయశ్చిత్తమయ్యె" నని పట్టినదెల్ల బంగా రగు నాపను లాఱు మూండౌచుండె నిది దైవప్రీతి కూల్యం బునం గాదె" యని చింతించి "చెల్లెలా! హాస్యాస్పద మగు కార్య మొనర్చితి" వని నిందించి "కాదు! కాదు! సీతలం పె ల్ల శ్లాఘనీయమే? అంతయు నాయవివేకమే" యని కలతెఱం గెఱింగి కళవళపడు సోదరునిం జూచి శూర్పణఖ "అన్నా! మన చేత లన్నియు నిష్ప్రయోజనము లయ్యె! కులగురుండును, నీ

తిశాస్త్రకర్తయుఁ బరమమాహోపాయవేదియు నగు శుక్రు న ర్థింపు. నీకు మేలయ్యెడు. అగియే శరణ్యంబు" అని బోధిం చిన రావణుఁ డెంతయు సంతసించి సకలకాలకార్యదర్శియగు శుక్రుని దర్శనార్థంబు చనియె.

---

# సంప్రశ్నము.



శ్రీమంతంబును, సోమలకుసుమవిరాజితవివిధలతావెల్లితచూతచందనమందారాదినానావనీరాజవిరాజితంబును, దరుశాఖాగ్రచరత్కలకంఠశుకపికరోత్పన్నమంజులనిస్వనమండితంబును, నిరంతరహోమధూమ నిబిడీకృత నభోమండలంబును, సతతాధ్యయనాధ్యాపనగభీరస్వర ముఖరితంబును, దినదినప్రవర్ధమాన మహామఖోత్సవసమాగతశతమఖప్రముఖ నిఖిలనిలింపనివహాలంకృతంబును, ఫలసమిత్కుశ కుసుమాదిహరణార్థపరస్పరాహ్వానబుసీకుమారకోలాహలంబును,నఖిలశాస్త్రపురాణేతిహాసకథాశ్రవణ కుతూహలాయత్తచిత్తమునిసత్తమాభిరామంబును, బరమపావనంబునైన తపోవనంబునందు నిరుపమాన నిష్ఠాగరిష్ఠుండును, సకలసుపర్వాభినందితపూతచారిత్రుండును, భార్గవవంశకలశాంబుధిశశాంకుండు నగు మార్కండేయమునీంద్రు సందర్శించి జైమిని వినయావనతుండై ప్రీతిపూర్వకంబుగా నిట్లనియె. మునీంద్రా! సకలనిగమార్థోపబృంహితంబును, సర్వపురుషార్థ సాధనంబును, సర్వకథాభిశోభితంబును నగుభారతంబును భాసురోల్లాసుం డగు వ్యాసుండు సవిస్తరంబుగ రచించె. సర్వేంద్రియంబులలో నయనంబుమాడ్కి గీర్వాణులలో ముకుందుచందంబున నరులలో విద్వాంసుని భం

గి సకలేతిహాసంబులలో భారతరాజంబు విరాజితంబై యుండు. భారతకాసారంబునకుఁ బాండవకథ జలపూరంబు. మనోహరోపాఖ్యానంబు లుత్ఫుల్లసరసీరుహంబులు. మృదుమధురపదసముదయంబు రాజహంసంబు. బహువిశేషంబులఁ బెల్లుల్లసిల్లుభారతంబున గూఢతరంబు లైనయర్థంబుల గ్రహింప మీకడ కరుదెంచితి. అనఘా! నిఖిలభువనోత్పత్తిస్థితిలయకారణుండు సర్వవ్యాపకుండును సర్వోపగతుండు నగువాసుదేవుం డేమికతంబున మానుషత్వంబు నొందెఁ? పరమపావనులైన పాండవపంచకంబునకు ద్రౌపది యొక్కతె యెట్లు పట్టమహిషి యయ్యె? భుజబలోపేతుండగు బలరాముఁడు బ్రహ్మహత్యాఘంబున కెట్లు గుఱి యయ్యె! ద్రౌపదేయులు కృతదారపరిగ్రహులు గాక యేల మరణంబు నొందిరి. ఇదంతయు విస్తరించి చెప్ప నీవే సమర్థుండ" వని ప్రార్థించిన నమ్మహాముని జైమిని కిట్లనియె.

"సంయమీంద్రా! నీవడిగిన యర్థంబులు వాకొనఁ బెద్దయుఁ బెద్దకాలంబు పట్టు. అఖిలభాషావిశారదులు సకలశాస్త్రపురాణపారంగతులు, ప్రవిమలప్రజ్ఞానిధులు నగునండజపతులు ద్రోణాత్మజులు పింగాక్షుఁడు, విరాట్టుఁడు, వృత్రుఁడు, సుముఖుఁడు నాఁ బరఁగువారు వింధ్యనగంబునం గలరు. అన్నలువురు నీవడిగిన యర్థంబు లెల్ల విన్నవింతురు. కన్నవిన జను మన్న జైమిని విస్మితుండై యట్టినిర్మలవాక్సిద్ధియు,

మహావేతృత్వంబు నాపులుఁగులకెట్లు లబ్బె. ద్రోణుం డట్టి సుతుల నెట్లువడసె. అనతిఁ గదే యని పలికిన మార్కండేయుఁడు జైమినికిం జెప్పం దొడంగె.

తొల్లి యింద్రుఁడు నిజనందనోద్యానవనంబున దివ్యరుచులీనునెలతాతితిన్నెయు దాసీనుఁడై యుండుతఱి వాని డెందంబున కమితానందం బొడఁగూర్ప నచ్చరమచ్చకంటులు గీతనృత్యంబు లచ్చెరువుగఁ సలుపఁ జొచ్చిరి. అంత నారదమునీంద్రుఁ డావనంబునకుఁరా సమరవల్లభుండు వానికి నుచితసత్కారంబులు ప్రియంబార నొనర్చి "మహాత్మా! ఇదియే మేనక! అదియే రంభ! అల్లదియే! యూర్వశి. వారె ఘృతాచీతిలోత్తమలు. ఈయచ్చరమచ్చకంటులం దేబిత్తరినృత్యంబు మీాకు మెచ్చొనర్చునో, చెచ్చెర నుచ్చరింపుఁ డన్న నచ్చానలలో హావభావవిలసనోత్కృష్ట నని విఱ్ఱవీగు నద్దాని నృత్యంబు మాకింపు జనించు నని నారదుండు పలికెను. అనుడు లాపువ్వుఁబోఁడు లాలకించి నిజరూపవిభవకాంతిచతురతాద్యనుపమగుణాధికురాలను నేన! నేన! యని వాదులాడఁ జొచ్చిరి. అంత వాసవుండు వారలవాదులు మాన్పి, నారదుండు మీాలో నేలోలాక్షి గుణవతి యని నుడువు నో యదియ యెక్కుడనినఁ గలహాశనుండును మంచుఁగొండపైఁ దప మొనర్చు దుర్వాసమునిపుంగవుఁ గలంప నెవ్వతె విలాస ప్రశస్తినడయు నాతె యెక్కుడని నుడివె. ఆపలుకుల కచ్చరలందఱు అచ్చెపడి

మాటాడనోడిన వపువనుమించుఁబోఁడి యామునిపుంగవు నవ లోకించి "ముకులతిలకా! పలుపలుకు లేల? నాకలికిచూపు టమ్ములఁ జిమ్మి యమ్మని డెందమ్ము గలంచి తపమ్ముఁ జెఱచి వాని గర్వమ్ము సర్వమ్ము వమ్ము చేసెదనని పలికి ముక్కలికి నభశ్చుంబిశిరస్సరజ్ఝరీపటలసమన్వితంబును, మద మాతంగకండూయమానకపోలకషణ చందనమహీరుహస్రుత పయఃప్రసూతగంధబంధురసానుతలంబును, శ్వేతాభ్రసంకాశ శిలీభూతహిమశకలసమన్వితంబునగు హిమవంతంబు పొంతకెం తయు సంతసంబున నరిగి తదీయసుందరకందరంబునందొక త పోవనంబుఁ జొచ్చి తప మొనర్చు మునీశ్వరున కనతి దూరం బునఁ దరుణసహకారమూలామలచంద్రకాంతోపలవేదికా సనాసీనయై దూర్వాసునవలోకించి ముంజేయి కపోలము నాను కొని గాఢతపోనిష్ఠాబ్ధిమగ్ను నెట్లు కలంతు నని మనంబునఁ బరిపరివిధంబులఁ జింతించినంత మంచి యుపాయంబొకండామె కుఁ బొడగట్టె.

సీ. చేర్చుక్కగా నిడ్డసిందూర తిలకంబు
ఫాలభాగంబునఁ బ్రభల నీనఁ
బదియు నాఱువన్నె పసిఁడి.గాజులు దచ్చి
కరయుగమ్మున ఘలుఘల్లు రనఁగ
ఆలీఢ మవలఁ బ్రత్యాలీఢ వైశాఖ
మండల సమపదుల్ తాండవింప

... ... ... ...

గీ. దివ్యరుచు లీను నెలరాతితిన్నెమీఁద
చెండు చిగురాకు చేతులఁ జెదరఁ గొట్టి
మొలకనవ్వొలయఁగ జగన్మోహనముగ
బంతి యాడఁగఁ జూచ్చె నయ్యింతి యచట.

ఇంపు దళుకొత్త వట్టిమ్రాఁకులు చిగుర్చ చందంబున గానంబు సేయుచు వింతగ బంతియాడుచుండఁ దద్గానలహరి ముని వీనులఁ బ్రవహింప మనము కలంగ వెఱఁగుపడి యమ్మౌని దివ్యదృష్టి నెల్లను గ్రహించి రూపగుణగర్వోన్మత్తచిత్తయగు నత్తలోదరిం జూచి కోపోద్దీపితమానసుండై "ఓసీ! దుష్టురాలా! జంకు లేక నీవు సంక్రందనసమక్షంబున నచ్చరలెల్ల రూరకుండఁ దగుదు నమ్మౌయని మత్తపంబు విఘ్నంబు సేయుపని యంతయుఁ బైవేసికొని వచ్చితివా! ఓసీ! నీవీక్షణంబున మర్త్యలోకంబునఁ బక్షికొలంబున జన్మింపు" మని శపించె. అంత నాకాంత దురంతచింతాక్రాంతయై గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు నంజలి ఘటించి "మునిపుంగవా! గర్వంబునఁ గన్నుగానక యే నొనర్చిన యీపరిభవదోషంబు సైరింపు" మని ప్రార్థించిన ముక్కోపి యని పేరొందిన యంతటి మహామునియుఁ గరుణారసపూరితాంతఃకరణుండై "ఓజవ్వనీ! నీవు విహంగరాడ్వంశంబున జన్మించి పదునాఱు వత్సరంబు లిలపైనుండి నల్వురు సుతులఁ గని దివ్యాస్త్రనిహతవై శరీరంబు

న్నతఱినొక్కనాఁడు విధిప్రేరణంబునఁ గురుక్షేత్రంబున కరిగి నిరంతరవివిధనిశితబాణపరంపరాచ్ఛాదనంబగు నాకసంబునం దమ్మహాసంగ్రామమధ్యంబున విహారంబు సలుపుసమయంబున భగదత్తుఁడెక్కిన సుప్రతీకంబను భద్రేభంబుపై ఫల్గునుం డేసి నభల్లంబు తార్క్షిగర్భమును విచ్ఛిన్నము గావించెను. తొంటి యట్ల తార్క్షిస్త్రీరూపంబు దాల్చి స్వర్గంబునకుం బోయె. గర్భమునందలియండ చతుష్టయంబు భూమిపైఁ బడునపుడు కాకతాళీయముగా సుప్రతీకం బనునేనుఁగుమెడ నుండుఘంట తెగి యాయండములఁగప్పెను.

శమీకుఁ డనుమునిబిడౌజుఁడు శిష్యగణపరివృతుఁడై యటకు వచ్చి తద్ఘంటానిలయంబునఁ బులుంగులు చెలంగుట యెఱింగి, విమలవిజ్ఞానమతులైనవిహంగంబులఁ గాంచి విస్మయంబుఁ జెంది "శిష్యులారా! ఇవి సామాన్యపక్షులు గావు. బాడబకులు లనుటకు సందియంబు లేదు. నకులశ్యేనమార్జాలమూషికాదులవలనిభయంబు కలుగకుండ వీని భద్రపఱుపవలయు" నని వారి కాజ్ఞాపించె.

ఛాత్రు లావిహంగంబుల నెత్తికొని నిజాశ్రమంబున కరిగి పయఃఫలాహారాదికంబులచే వానిని బోషించుచుండ నవి మాసత్రయంబునఁ బ్రవర్ధిల్లి యొక్కనాఁడు సకలమునిజనాశ్చర్యకరంబుగా జవసత్వంబు లొప్పార సూర్యమండలంబున కెగసి, మగిడి వచ్చి, మునినాథునకు భక్తి మెయిఁ బ్రణమిల్లి

యిట్లనియె. "తండ్రీ! మాజననీజనకు లెవ్వరో యెఱుంగము. కరుణామయుఁడవై నీవ మమ్ములఁ బెంచితివి. నీవ త్రాతవు. నీవ తండ్రివి. నీవ గురుఁడవు సర్వము నీవ. మే మెన్నఁడు వృద్ధి పొందుదుమో, పక్షంబు లుత్పన్నంబు లై మే మెప్పుడు మింటఁ బోవుదుమో యని నీ వెప్పుడు నువ్విళ్ళూరు చుండెడువాఁడవు. మేము పరిబుద్ధుల మైతిమి. మాచేయుపను లానతీఁ గదే" యని పలికినఁ బరిస్ఫుటవాక్యంబుల కాతఁడు వెఱఁగంది మెయి నిండఁ బులకలు జనింప నిట్లనియె "ఎవని శాపంబున మీ రీవికృతరూపంబు లేమికతంబునఁ బొందితిరి. మీ కీవాగ్విభవం బెట్లలవడెనో చెప్ప వలయు" ననినఁ బక్షులమ్మునివరుతో నిట్లనెను.

తొల్లి విపులుం డనుసంయమీంద్రునకుఁ దపోధనులు నుదాత్తగుణులు నగు సుకృశుండు తుంబురుండు నాఁ బరఁగు కొమరు లిరువురు కలరు. అందు నేము సుకృశునకుఁ దనయులము. మే మేమఱక ప్రత్యహంబు పితృశుశ్రూషణం బొనరించుచుండ నొక్కనాఁడు దేవవిభుఁడు మాజనకుసూనృతవాక్పరిపాలనాసక్తి నరయఁ దలఁచి వృద్ధవిహంగరూపంబునఁ జనుదెంచి యిట్లనె.

మునివల్లభా! నేనుత్తుంగవింధ్యశృంగంబున నుండఁ బ్రచండపవనాహతి నాపక్షంబులు భగ్నంబులయ్యె. ఇరాఱు దినంబులనుండి నాకు నిద్రాహారంబులు లేవు. జరాగ్ని దహిం

పఁ జేయుచున్నది. నాకాతిథ్యం బీయవే' యని యడిగిన నా తఁ డాపులుఁగు ప్రాణంబుల గాచి నీ కెయ్యది యిష్టం బద్దా నిఁ బెట్టెద ననిన నాకుహానావిహంగము మనుజమాంసంబు గోరె. అంత మాతండ్రి రోసి యిట్లనియె "అక్కటా! నీవు కడు క్రూరహృదయుండవు. హంసార్జితాహారం బడుగఁదగునే? కాని మ్ము, ఆడినమాట కెదురాడఁ జాల నీ వెట్టివాఁడ వైన నేమి? అశనం బవశ్యంబు పెట్టించెద నని మమ్ములఁ బ్రియమారఁ జేరంజీరి మిమ్మీఖగమున కామెత నొసఁగఁ దలఁచితి. సుతుఁకుఁ దండ్రిగా పరమపూజ్యుఁడు. కాన నాసత్యవాక్సంధతఁ బరిపాలించి మాతనువుకండ లీయండజపతి కిండ" నెను. మేమెల్లరము మరణంబునకుఁ దల్లడిల్లి "తండ్రీ! మీరిట్లనఁ జెల్లునే? 'ఆత్మానం సర్వదా రక్షే' త్తనునట్లాత్మరక్షణంబు ముందొనర్చికొని పిదప నొరుల సంగతి యాలోచింపవలయుఁ గాదె! ఒకని దేహం బొకని కీఁదగునా! దేవపితృఋషి ఋణములఁ దీర్చి పరిచర్య సలుపువాఁడు తనయుఁడు గాని యూరక శరీరంబు విడుచువాఁడు పుత్రుఁడగునే? ప్రాణంబు లున్నంగదా శుభంబులు వడయవచ్చు? దానధర్మంబులు సేయ నగు. అంతియ కాని యకారణంబుగఁ బ్రాణంబులు గోల్పోవఁ దగునే? కీడొకింతయుఁదన్నుఁ జెందకుండ నరుఁడు రక్షించుకొనుట ధర్మమని కదా తత్త్వవిదులు వచింతురు. కాన మీ చెప్పినయిప్పని మేము చేయ నొల్లమనిన మాజనకుండు దాఁ బ్రమనయనుండై "తం

డ్రియాజ్ఞఁ దిరస్కరించితిరి గాన తిర్యగ్జాతుల రగుఁడని శపించి సత్యంబు పరిపాలింపఁ దలంచి యాపక్షీంద్రునకుఁ దా నాహార మౌదు నని నుడివె. అప్పులుఁగుల! జనియాజ్ఞానుసారంబు మా తండ్రి యోగబలంబున జీవంబులు త్యజించి దాని కాహారంబు కా సిద్ధపడెను. పక్షీంద్రుఁ డెంతయు విస్మితచేతస్కుఁడై వాని కి సంతసించి నిజరూపంబు ధరించి యిట్లనియె. మునిశ్రేష్ఠా! నేఁ బక్ష్యాకృతి నొందినయమరాధిపుఁడను. నీసత్యవర్తనాపరిశీలనం బునకై యిట్లు వచ్చితిని. కరము మోదావహంబయ్యెనీయభీప్సి తం బెద్దియేని తీర్పసంసిద్ధుఁడను. కోరుకొ మ్మనిన మాజనకుఁ డు సంతసించి తన కైంద్రజ్ఞాన మావహిల్లుటకును, విమల జపతపోదానధర్మంబులం దనారతం బాసక్తి గల్గుటకును, వర మిమ్మని వేడిన నాతఁడు వల్లె యని యదృశ్యుఁ డయ్యె.

తండ్రికి వందనమాచరించి మాతప్పు సైరింపు మని ప్రా ర్థించి తండ్రీ! మరణంబునకు వెఱచి యట్లంటిమి. శరీర మస్థి మాంసరుధిరయుక్తంబు గద! కామాదులకులోనై మోహసా గరంబున లోకంబంతయు మునుఁగుచున్నది. "ప్రవిమలజ్ఞా న ప్రాకారంబును, శల్యకీలకంబును, మహామాయా ముఖంబు నైన యిట్టిపురమునకుఁ బురుషుం డనువాఁడు రాజు. మనో బుద్ధులు వానికిఁ బరస్పరవిరోధు లైన మంత్రులు. కామ, క్రోధ, లోభ, మోహంబులు, బలవంతులైన శత్రులు. ఈ నలువురు శత్రువులును లోఁ జొరఁబడకుండ రాజు పురవీథుల

ను బదిలముగా భద్రపఱచెనేని, నిరాతంకుఁడు, స్వబలసంపన్నుఁడు నగును. ఆవిధులం గట్ట నసమర్థుండేని కాముఁడను పరిబలవిరోధి నేత్రాదిపంచద్వారప్రవిష్టుండై యంతటను వ్యాపించును. వాని వెనుక ముువ్వురు శత్రువులు వెంటాడి యానలువురుఁ గూడి బాహ్యేంద్రియవసంబులతో స్నేహం బొనర్చి యావీథుల ను తమ వశంబు జేసికొని దుర్గాసనస్థులై, యాకోట యుఱుబులం ద్రోచి మంత్రుల మడియఁ జేసి యంతటను దామన్నై వర్తింతురు. అమ్మేదినీకాంతుఁడు మంత్రిరహితుండై నిగళపరివారుండునై నశించు. ఈవిధంబునఁ గామాదిశత్రువులు మనుష్యస్మృతి నాశకులగుటంజేసి యేము మోహావృతచిత్తులమై ప్రాణలోభంబున సెఱుకచెడి, బుద్ధివిడిచి తప్పొనరించితిమి. మాయెడఁ బ్రసన్నుఁడవై శాపంబు గ్రమ్మఱింప వే" యని ప్రార్థించిన నామహాత్ముఁ డిట్లనియె. "నాయనలారా? నా వచనం బమోఘంబు. మిమ్ములఁ గరుణించితి. దురితక్లేశ భయంబులు మిమ్ములఁ బొందకుండును. విమలాంతరంగులై పుణ్యపథానుసరులై, సకలవిద్యాపరులై, మనుష్యవాక్ప్రభావంబులనుందురని" మాకుఁ బ్రసాదించె. అది కారణంబుగా మేము పక్షుల మైతిమి. ఇవు డేమొనర్చునది యానతీఁగదే" యని వారు శమీకుని బ్రార్థింపఁ "బక్షులారా! మీరిపుడు వింధ్య పర్వతంబున కరుగుఁడు. మేలయ్యెడు" మని యాజ్ఞాపించి శమీకుఁడు వారికడ సెలవు గైకొని తన నెలవునకుఁబో

యెను. సాంద్రకాంతులీను సూర్యకాంతపు జాలచేతను, నిర్మలచంద్రికాంతులను దర్శించు చంద్రకాంతోపలంబుల చేతను, నక్షత్రపంక్తి నేలు వజ్రపంక్తులచేతను, బొల్పారు నంబరచుంబితంబు నగు వింధ్యనగంబున కరిగి యాయండజ పతులు పరమజ్ఞానవంతంబులై తపస్స్వాధ్యాయసంపన్నులై సుఖం బున్నవారు. వారల నడుగఁ బొమ్మని మార్కండేయుండు నుడివిన జైమిని వానికడ సెలవు గైకొని వింధ్యాద్రి కేగెను.

జైమిని వింధ్యగిరియందలి సోయగంబులఁ గలయంగనుంగొనుచు, విహంగకుమారులున్న శిఖరప్రదేశంబున వారి మధురాధ్యయనధ్వానంబు విని విస్మితుండై భారతీపరివర్తనంబు చోద్యంబని యెఱింగి విశాలశిలామయవిష్టరోప విష్టులైన యా ద్విజోత్తములంగాంచి యిట్లనెను. "అయ్యలారా! నేను వ్యాసభట్టారకుని శిష్యుండనగు జైమినిని. భవద్దర్శనార్థంబిట కరుదెంచితి" నన వారును హర్షాయత్తచిత్తులై వాని కాతిథ్య మొసంగి సేమమడిగి వీవనలఁబట్టుచందంబునఁ బక్షజన్యంబగు వాయువుచే నేదదీర్చి "మా జన్మ పావనంబయ్యె. మా యొడళుల మండుపితృశాపవహ్ని చల్లారె. మునీంద్రా! భవదాగమన కారణం బే" మని యడిగిన జైమిని మార్కండేయుల నడిగిన చందంబున వారినిఁ బ్రశ్నింప నావిహంగపతులు "మా తెలియునర్థంబు లెల్లఁ దెల్పెదము వినుఁ" డని యాదిపురుషుండు నప్రమేయుండును, జరాచరగురుండును, బరమా

త్కుండు నవ్యయుండునగు నారాయణునకు నమస్కరించి యి త్తెఱంగున జైమిని కెఱింగింపఁ దొడఁగిరి.

"సంయమీంద్రా! అఖిలప్రజాసర్గ హేతుభూతుండును, సకలలోకార్చితుండును, నిర్గుణసగుణోదారుండునగు నారాయణునకు నాలుగుమూర్తు లమరు. అయ్యవి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, నారాయణాభిధానంబులు. వర్ణరూపనామంబులు లేక మిగులఁ దేజోమయుండై, సర్వగతుల సంపూర్ణత్వమును పొంది రజస్సత్వతమోవిదూరుఁడై పరిపూర్ణనిష్ఠాగరిష్ఠుఁడగు నాదిమూర్తి వాసుదేవుండు నాఁబరగు. శేషాహిరూపంబుఁదాల్చి సకలభూభారంబు ప్రకాశమానంబగు వేయి శిరముల మోసి సర్పసందోహంబు గొలువ తమశ్శక్తిస్వరూపంబగు సంకర్షణంబు ద్వితీయంబు. భూప్రజల బహువిధధర్మపథంబులఁ బరిపాలించుచు సత్వరూపంబై ప్రద్యుమ్నంబనబడునది తృతీయంబు. పయఃపారావారమధ్యమున శేషశయ్యపైఁ బవ్వళించి రజశ్శక్తిస్వరూపుఁడై నిఖిలలోకముల గల్పించు నారాయణుండు చతుర్థమూర్తి. నాలుగుమూర్తులందును ప్రద్యుమ్నమూర్తియైన దేవుండు పరమ సాత్వికుండు. సకలధర్మకుశలుఁడు. భక్తజనలోలుఁడు. జగదవనశీలుఁడు. అపార కృపావిశారదుఁడు. కావున సురగణరంజనంబు నసురగణభంజనంబు, నిగమరక్షాఖేలనంబుధర్మపరిపాలనంబు చేయుచుఁ బర్యాయంబున, వరాహ, నారసింహ, వామనాదిరూపఁ

బులఁ గైకొని హిరణ్యాక్షు సంహరించి, హిరణ్యకశిపు హరిం
చి, బలి నడంచి, జగంబులయులజడి మాన్చు. మఱియు దేవ
మనుష్యతిర్యక్కులం దుపేంద్ర, రామ, త్రివిక్రమాదిరూపంబుల
నావిర్భవించి లోకరక్షణోపాయపరాయణుండై వర్తించుటకా
రణంబుగా భూభారసంహారార్థంబు వాసుదేవుండు మానుష
త్వంబు నొందె" నని యప్పులుఁగులు విన్నవించె.

తొల్లి విశ్వకర్మగారాబు కొమరుండగు త్రిశిరుని శత
మఖుఁడు మడియించిన జనకుండు విపులకోపోద్దీపితమానసుం
డై యద్దురాత్ముని వధింపనోపు తనయుఁ బడసెద నని రయం
బున నొక్క మఖం బొనరింపఁ బ్రయత్నించి జడ వహ్నిలో
నెడతెగక వ్రేల్చిన నతిభయంకరాననదంష్ట్రోజ్జ్వలమూర్తియు
వృత్రాసురుం డావిర్భవించె. సప్తఋషుల సాహాయ్యంబున
వాని కతులితంబగు తైజసస్ఫూర్తి గల్గె. అట్టివాని నింద్రుం
డు కపటోపాయంబున వధించి వృత్రారియయ్యె.

ఏజీవి కైన హాని గల్గించుటయు పాతకంబు. అందు న
రహత్య ఘోరదురితంబు. అందును విప్రహత్యాసంజనితకళం
క పంకక్షాళితంబగు ప్రాయశ్చిత్తజలంబు జగంబునం దరుదు.
హరియొండె, హరుఁ డొండె, లోకేశుఁ డొండె, నాకేశుఁ
డొండె విప్రహత్యాచరణంబున దురితంబు వాటిల్ల కుండునే!
అట్టి హత్యం జేసి కాదె యింద్రుని దేహబలం బుడివోయె. త్రి
విష్టపాధిపతి నష్టబలుండై యున్న యవసరంబున దైత్యదాన

వు లాసురపతి న్జయింప మఖాదిసంపద లణగింపఁ బూని బహు రాజవంశంబులం దుద్భవించిరి. అంత భూదేవి క్రూరజనభారవహనవిహ్వలయై సురాద్రి కేగి యింద్రాదిసుపర్వులం గని యంజలి ఘటించి "దేవా! మనుష్యలోకంబున మహాభీమబలాఢ్యులగు దైత్యు లనేక నృపవంశంబులం దుద్భవించి పెచ్చుపెరిగియున్నవారు. ఆభారం బేను భరింప నోప. ఆవ్రేగంతయు బాప నీవ సమర్థుండవు. అనుగ్రహింపఁ గదే" యని ప్రార్థించిన భూభారం బుడుప నయ్యమరు లత్యనుపమ తేజోంశంబుల ననేక రాజవంశంబుల జనించిరి. దేవేంద్రుండును నిజ తేజం బేను నంశంబులుగఁ జేసి పృథివ్యాపస్తేజోవాయు రాకాశ పంచ మహాశక్తు లూదినఁ గుంతీమాద్రుల గర్భంబున ధర్మజ భీమార్జుననకులసహదేవులుదయించిరి. సూర్యుం డొక్కండయ్యు పలుఘటంబులం బ్రతిబింబించి పెక్కురీతులఁ గానిపించు భంగి మహేంద్రుండు తానొక్కరుండయ్యు ధర్మజభీమార్జుననకులసహదేవ రూపంబులఁ గాన్పించుచుండె. దీనిం దెలియఁ జాలక మూర్ఖులు, "ఏవురు భర్తలట! ద్రౌపది మహాపతివ్రతయట! యని పరిహసింతు" రని నుడివిన జైమిని సంతుష్టాంతరంగుఁ డయ్యె.

అనంతరము బలరాముని బ్రహ్మహత్యాచరణ ప్రకారం బెఱింగింపు మని కోరిన నాదివ్యపక్షు లిట్లు చెప్పం దొడంగె.

మునిశ్రేష్ఠా! బలరాముఁడు ద్వారవతినుండి వచ్చి కురుక్షేత్రంబున సమవేతులై, సమరోత్సాహంబుననున్న కౌరవపాండవుల విలోకించి విచారగ్రస్తచిత్తుండై "కృష్ణా! నరనారాయణు లిరువురు మణిసూత్రన్యాయంబున మెలంగుచుందురు. హరి విడిచి కౌరవభూమి పాలకునిపక్షంబే నెట్లవలంబింతు. పాండు తనయుల పక్షంబు వహించి మచ్ఛిష్యవర్యుండగు కౌరవేశ్వరుని యపజయంబే నెట్లు సహింతు? ఇట నాకు ముందు నూయియు, వెనుక గోయియు ననుచున్నది! దీని కేది తెఱవు! ఇటనుండి తొలంగి పోవుటయే యుత్తమంబని తోఁచుచున్నది. కాని దీనికిం దగువెర వూహింప ముకుందుండు గలఁడని నిశ్చయించుకొని యంతయు ముందుగా ముకుందునకెఱింగించి యంతని యుద్దేశప్రకారము సీరి శౌరిని వీడి నిజపురంబున కేగి మఱునాఁడు తీర్థసేవాపరాయణుండై యొక్క కేల ముసలంబు నింకొక కేల రోహిణీదేవికరంబు గైకొని మత్తమాతంగంబు తెఱంగున రైవతకాద్రిసానువనరమ్యతలంబున కేగె.

ఈశ్వరాంశసంభూతుం డగు రామభద్రునకు వనవాసము దేనివలనఁ గలిగె? కాలవశమున! బలిచక్రవర్తికిఁ దీఱని బంధన ప్రాప్తి యెద్దాన ఘటిల్లె? కాలవశమున! భీమబలాఢ్యులగు పాండుపుత్రులు దేనివలన ఘోరారణ్యంబులం బడరాని పాట్లు పడిరి? కాలవశమున! సకలసామ్రాజ్యభోగంబులఁ బరిత్యజించి రాముఁడు నందిగ్రామసమీపస్థభూధరకందరంబులం

దేడేండ్లు దాగి యుండినది కాలవశంబునం గాదె? కాలవశంబున కింక బలరాముం డన నేపాటివాఁడు! అనగంబునం దొక్క యున్నతవిశాల సానుతలంబునం దల్లిబిల్లిగ నల్లుకొని యుల్లంబునకుఁ బెల్లుసంతసం బొనగూర్చు పొదరింట నున్నతాసనమునం దుపవిష్టుఁడై, కణ్వ భరద్వాజ, కుశికాదిమునివరులకు సూతుండు పురాణేతిహాసంబుల వినిపించుచున్నతఱి బలరాముం డట కేగె! మునులందఱు సీధుపానోన్మత్తుఁడగు సీరిం గనుంగొని భీతి దిగ్గనలేచి వాని కాతిథ్య మొసంగిరి. కాని పౌరాణికుం డగు సూతుండు పీఠంబునుండి లేవకుండుటం గని హలధరుం డభీలక్రోధమూర్తియై, ముసలంబున నాతని శిరంబు గాఢంబుగ నేసిన నాతఁడు గతప్రాణుం డయ్యె. యతులతి భీతకంపిత మతులై గతి గానక యెల్ల దిశలకుఁ బాఱిరి. అంతఁ గొంతవడికి హాలధరుండు తెలివి వహించి "కష్టా! ఎంత ఘోరకార్యం బొనర్చితి!"

"చ. కరుణ యొకింత లేక యవుఁ గాదను నట్టితలంపులేక భూ
సురుఁ డనుశంకలేక యిటు సూతుని నేఁ దెగఁజూతు నే సురా
పరిణతదుర్మదాంధ్యమునఁ బాపముఁ జేసితి దేహ మెల్ల నె
త్తురుఁబోలవల్చుచున్న యది దుస్తరపాతకసంభ్రమమ్మునన్

అని బలభద్రుండు పశ్చాత్తాపతప్తచిత్తుండై తద్ఘోరపాపోపశమనార్థంబు మునిజనుల యమోఘవాక్యానుసరుండై రేవతీయువతీజనంబుల వీడ్కొల్పి సరస్వతీపుణ్యతీర్థంబు లాడం

జని షోడశమహాదానంబు లాచరించి యింత భూతదేవతాతృప్తియొనర్చి చనియె నని పలికిన జైమిని వినయానతుండై నా కడగొట్టు ప్రశ్నకుఁ గూడ సదుత్తరం బిచ్చి సందేహంబు తీర్పంగదే! యని ప్రార్థించిన దివ్యపక్షు లిట్లు చెప్ప మొదలు వెట్టె.

మునికులతిలకా! మహాంత గుణాభరణాభిరామమూర్తియు, రిపునృపసమవర్తియు, నిత్యసత్యవర్తియునగు హరిశ్చంద్ర చక్రవర్తి దుర్భిక్షడంబర జారచోరభయంబులు పొరయకుండ ధర్మప్రీతిఁ బ్రజాపరిపాలనం బొనర్చుచు నొక్కనాఁ డరణ్యంబున కేగి మృగయావినోదంబునఁ బ్రొద్దుపుచ్చుచుండ "మమ్ము రక్షింపుఁడు! రక్షింపుఁడు"ను నాఁడుకూయి వినంబడిన నార్తరక్షణపరాయణుండగు నాతండు వేఁట యుడిగి యందంద నారయ మొదలిడియె. ఆసమయంబునందు విఘ్నేశ్వరుం డచ్చటనుండి "వోడకోడకుఁ" డను రాజు పలుకులు విని "విశ్వామిత్రుఁడు తపోమహత్త్వమున విద్యల సాధింపఁ దొడఁగ నావిద్యలు తీవ్రార్తిభయంబున వాపోవుచుండె. ఈరాజు భయముడుగుఁ డని యార్చె. నా కిదియే తగు సమయంబు ఈరాజును ప్రేరేచి మునిరాజునెద నొవ్వ నాడించెద. అంత నావిద్యలన్నియు రక్షింపఁబడు నని తలంచి వినాయకుండు రాజు హృదయంబు సొచ్చె. హరిశ్చంద్రుఁడు గణేశప్రేరణంబున "చ. వెలుఁగుమహాప్రతాపశిఖి వేఁడిమిదిక్కులనిండుచున్న నా

కోలఁదియెఱుంగ కెవ్వఁడొకో ఘోరపుఁజిచ్చిటుచీరఁగట్టెడి
న్దలరక యిట్టిదుర్మదు నధర్మపరున్ దురితాత్ముఁ జండదోః
కలితధనుర్విముక్తపటుకాండవిఖండితగాత్రుఁ జేసెదన్."

అని బెట్టదల్చుచు డాసిన రాజు కఠోరపుంబలుకుములు కు లాముని తిలకు చెవులం దాకిన ముని పెనుగోపమ్మున మండిపడి తపోనిష్ఠనుండి లేచిన నావిద్యలన్నియు సంక్షిప్తంబులయ్యె. రాజంత నాక్రోశించు వారిం గానక యుగ్రమూర్తి యగు విశ్వామిత్రుం గాంచి మ్రొక్కిన నాతండు మండిపడుచు "ఓరీ! దురాత్మ! నిలునిలు" మని ఘనగర్జితంబువడువునఁ బలికిన విని "మునివరేణ్యా! నావలనఁ దప్పేమియు లేదు. ఇచ్చుటయుఁ గాంచుటయు, విలు కేల నిడుకొని రణంబు సేయుటయు రాజధర్మంబు" లని పలికిన "నోయీ! ఎవ్వరికి నిత్తువు? ఎట్టివారిని గాతువు? ఎవరితో రణంబు సేయుదువు" చెప్పుమనిన "విప్రుల కీయుదు నార్తజనులఁ గాతు, రిపులతో నని సేయుదు," నని పలికె.

గాధితనూజుఁ డానందభరితుఁడై "రాజా! ఏను బ్రాహ్మణుఁడను. రాజసూయాధ్వరం బమరేంద్రప్రీతిగా నొనర్తు. దానికింపగు దక్షిణలిమ్మని" వేడిన హరిశ్చంద్రుండు హర్షసుధామగ్నుండై త్రికరణశుద్ధిగా నిచ్చితి. ఒక్కదక్షిణయన నేమి? "మునీంద్రా! నేను నాసర్వైశ్వర్యమ్ము, నారాజ్యము నీయధీనము. నీ కెయ్యది యభిమతం బయ్యెగి కోరుకొ

మ్ము" నిన "రాజా! నీ వేమిచ్చినను కా దనను. నీసర్వసా మ్రాజ్యము నాకొసంగు" మని గాధిసూనుఁడు వేఁడిన నమ్ము నిపుంగవు దోడ్కొని పోయి సత్యసంధుం డగు నారాజు సకల మహీరాజ్యలక్ష్మిం ధారవోసె. అంత గాధినందనుండు ద యావిహీనుండై "రాజా! నిను గాంచి నామాట లక్ష్యపెట్టి ననుజూచువా రెవరు? సూదికి రెండు మొన లుండుట న్యాయం బే? నీవింక నూరు వెసలి తడయక పొమ్మనిన విని సత్యవా క్యబద్ధుండై సర్వంబు సంతసంబునఁ బరిత్యజించి మణిభూషణో త్కరముల విడనాడి వల్కలంబులం ధరించి ధర్మపత్నియుం దానును సుతుండును వెడలుతఱిముని వాని కడ్డుసొచ్చి "రా జా! యాగదక్షిణకుఁ బ్రతిశ్రుత మైనయర్థ మీక యెక్కడి కే గెదవు. ఆధన మిచ్చి మఱి కదలుము" నిన విని హరిశ్చం ద్రుఁ డాశ్చర్యచకితుఁడై "మునివర్యా! ఇవి యేటిమాటలు నిఖిల రాజ్యంబు నీకిచ్చి శరీరమాత్రావశిష్టుఁడనై యున్న నే నెట్లు నీకు ధన మీఁగలవాఁడ" నని పలికిన ముని పెనుగోపం బున మండిపడి "రాజా! యిత్తు నని వాక్రుచ్చిన యాగదక్షిణ నీయ వేని యనృత దోషఫలంబు ననుభవించెదవు. అన విని రాజు వెఱగుపడి యొండుమనంబున విచారించుచుండ నమ్ముని "వలయు నేని నీ వెన్నాళ్ళు గడు వడిగెదవో యడిగి కొను మని" పలికిన రాజిట్లనియె. "మునివర్యా! నా కొక మాసం బు గడు వొసంగుము, నీయప్పుఁ దీర్చెద నని" ప్రతి వచనం

బిడిన నామునియు సంతసించి వానిం దీవించె.

రాజేంద్రుఁడు, భార్యయుఁ బుత్రుండును దానును కాల్నడఁ బురము వీడి వెడలుచుండె. పౌరు లేతెంచి మొగంబులు విన్నఁబోవ దురంతచింత నిట్లనిరి. ఆదిగర్భేశ్వరియగు నీదేవేరి కిట్టి యిక్కట్టు సంభవించెనే? అల్లారుముద్దుగాఁ బెఱిగిన నీముద్దుపట్టి భాగ్యం బిట్టిదయ్యెనే? నిత్యసత్యవ్రతాభిరాముండ వగు నీకిట్టి దురవస్థ ఘటిల్లెనే? రాజేంద్రా! ప్రజలయార్తింబాఱఁ ద్రోలుటయెకదా! రాజునకు ధర్మంబు.

"ఉ. ఊరక యేలపోయెదు నృపోత్తమ! దీనులమమ్ముఁ జూడవే
కారుణికాగ్రగణ్యుఁడవుగావె? ముహూర్తమునిల్చి నీముఖాం
భోరుహవిభ్రమంబు తనివోవఁగఁ గ్రోలి మదీయలోచనో
దారమధువ్రతాళి ముద మందెడు నట్టులుగా నొనర్పవే?

అని విలపించు తదీయదీనాలాపశృంఖలానివహంబులం దవిలి ముం దడుగిడుటకుఁ గాళ్లాడక మార్గమువంక నిల్చిన కౌశికుం డలిగి "యోరీ! దురాత్మ! అనృతవాక్ప్రలాపా! నాకు చితవృత్తి నీరాజ్యమంతయు ధారవోసి మఱల పురజనులను బురికొల్పి నీరాజ్యంబు గైకొనుట కిచ్చట నింకను నిలిచియుంటివా! యని కన్నులనుండి నిప్పులు రాలఁబల్కుచుం గరికరము మదంబునఁ గరంబు నెత్తి లలితలత నేయువడువునఁ దన చేతి ప్రచండదండంబు నెత్తి చంద్రమతి కృశాంగవల్లి నేసె. హరిశ్చంద్రుం డట్టి దారుణకృత్యంబు సూచియు మాటాడక ముందున

కు సాగిపోఁ దొడంగె. కట్టా! అట్టిదారుణకృత్యం బవలోకించిన నెట్టిఁ డైన సహింప నేర్చునే? విశ్వేదేవత లామునికోపసంరంభంబు జూచి యక్కటికంబు లేక కుసుమకోమలగాత్రిని మోఁదుటఁ గాంచి "యోరీ! దుర్మతీ! జన్మములు చేసితి తపములు చేసితి వందువు. దయావిహీనుఁడవై చేసిన యజ్ఞయాగాదిక్రతువుల వలన నింతయు ఫలము చేకూర నేర్చునే? సత్యవాక్యధురంధరుండగు నీనరేశ్వరు నెట్టిబాధలం బెట్టుచుంటివి? నీకెక్కడి పుణ్యలోకములు! ఎక్కడి యైశ్వర్యంబులు! చాలు! చాలు!" నని కొసరి కొసరి దూషించు విశ్వేదేవతలం గాంచి విశ్వామిత్రుఁడు రోషారుణితనేత్రుఁ డై "దుర్మదాంధులారా! మనుష్యపక్షపాతంబున నన్ను ధిక్కరించితిరి గాన మీరును మనుష్యులై భువిజనిింపుఁ డని శపించె.

విశ్వేదేవత లెంతయుఁ దల్లడిల్లి పని లేక కలుగఁ జేసికొనిన జోక్యంబున కిది ఫలంబని వగచి వగచి యాముని ప్రోలం బడి "మునిచంద్రా! మానవరూపంబునఁ బుడమిపై నేము సంచరింపఁ జాలము. ఏమును, మాసంతానంబును దేవభావంబులు గైకొన కెట్లు మనఁ గల్గుదుము. తెలియక కొనర్చిన తప్పిదము క్షమింపు" డని ప్రార్థించిన ముని ప్రసన్నచిత్తుఁడై "మీరు భూమిపై నరులై బ్రహ్మచారులై యరిషడ్వర్గవిదూరులై, యల్పజీవులై, దేవభావంబులఁ గైకొం" డని వరంబిచ్చె. అది కారణంబుగ విశ్వేదేవత లేవురును పాండునంద

ను లేవురకు ద్రౌపదీగర్భంబున జనించి కృతదారపరిగ్రహులు గాక, దీర్ఘాయువు లేక మరణించి రని చెప్పిన జైమిని యత్యంతసంతుష్టాంతరంగుఁ డై పులుఁగుల కనేక ప్రణామంబు లాచరించి వెడలి పోయె.



# Errata.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 9 | మీా వేఁడ | మూా వేఁడ |
| 21 | 3 | నేవెవ్వ | నేనెవ్వ |
| 24 | 14 | సిక | సిక్త |
| 31 | 12 | ఘ్రిసంబు | ఘస్రింబు |
| 32 | 18 | శివజటాటూాట | శివజటాజూాట |
| 32 | 21 | కొాట్టకొాను | కొాట్టుకొాను |
| 33 | 4 | బరువెత్త | బరువెత్తు |
| 37 | 19 | కెలను | కెల్లను |
| 41 | 7 | తిచ్ఛరణ సేవ | తచ్ఛరణ సేవ |
| 43 | 8 | పద్మంబు | సద్మంబు |
| 47 | 13 | శూలా | శూల |
| 51 | 19 | చేతులగల | చేతులుగల |
| 53 | 20 | సరితీరంబు | సరిత్తీరంబు |
| 59 | 15 | లేహ్యపెయాది వివిధ వస్తువులు. | లేహ్యపేయాది వివిధ వస్తువులు. |
| 65 | 5 | దేవతులు | దేవతలు |
| 67 | 16 | గీటడించి | గీటడంచి |
| 83 | 12 | ఆని | అని |
| 88 | 2 | సలుపలు | పలుపలు |
| 88 | 5 | పరఝరీ | సరర్ఝరీ |